# భానుమూర్తి భార్య

[కథల సంపుటి]

రచయిత:
ఎన్. ఆర్. చందూర్

పబ్లిషర్సు:
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

# విషయసూచిక

# భానుమూర్తి భార్య

"ఎక్కడికి వెళ్తున్నావ్!" సందు మలుపు తిరుగుతూ వుండగా రామూని అడిగింది పదిహేడేళ్ళ పడుచుపిల్ల.

రామూ ఒక్కసారి నిర్ఘాంతపోయి, సమాధానం కోసం క్షణకాలం తడుముకొని, చిరునవ్వు పెదవులమీదకి రప్పించి, చేతిలోవున్న వుత్తరాలు చూపిస్తూ, 'పోస్టువేళ అయింది. ఉత్తరాలు పోస్టులోపడేసి వస్తాను' అన్నాడు. ఏవేవో కలలతోటీ, ఆలోచనలతోటీ, ఎగుడు దిగుడు భావాలతోటీ, తలవంచుకు నడుస్తున్న రామూ ఖంగారు పడక ఏమవుతాడు?

"మీ యింటికే వెళ్తున్నాను. తొరగావస్తావు గదూ!" అంది గుణబాల, రామూ ముఖంలోకి నేరుగా చూస్తూ.

"అయిదు నిముషాలు" అంటూ రామూ ముందుకి సాగాడు. గుణబాల సందులోకి తిప్పుకుంది.

రామూ నడుస్తున్నాడన్నమాటేగాని తలపులన్నీ గుణబాల మీదే వున్నాయి. చాల చిన్నప్పుడు – అంటే మూడేళ్ళ క్రితం – భలేపిల్ల; పొట్టిఅల్లరిది. వాడెవరు! శంకరంపెళ్ళిలో గాబోలు మహాచిలిపి తనం చేసింది. వసంతాలు చల్లుకునేరోజు, కొంటెగా తననెత్తిని చెంబుడుపోసి

తెల్లక పాలిపోయింది. తను ఇల్లూ వాకిలీ అంతా కలియ తిరిగాడు. కనిపించ లేదే! ఆఖరికి గడ్డివాము వెనకాల దొంగ దాక్కుంది తన చేతితో ప్రశ్న చెబుతూ ఆమె నెత్తిని కుమ్మరించాడు. అప్పుడు తన చెయ్యి గట్టిగా పట్టుకుని, కను కొలకుల్లో నుంచి జాలిగానూ కమ్మగానూ చూసింది. ఆ చూపుకి బహుమానంగా అక్కడనే, ఆ గడ్డివాము వెనకనే, ఆవిడ్ని ముద్దాడి వుండవలసింది. అతి స్వాభావికంగా జరగ వలసిన విషయం.

కాని, తనే తనను నిరోధించుకున్నాడు. ఆ తాత్కాలికోద్రేకానికి గాని లోబడితే ఆవిడ ఏ వెర్రిఆశలు పెట్టుకుని తన బతుకు పాడు చేసుకుంటుందో! మంచి చెడ్డలు తెలీని అమాయకురాలు తనవంక చూసిందిగదా అని దగ్గిరికి లాగేసుకోవడమేనా!... గుణబాల ఆ తర్వాత ఒకటి రెండు సార్లు తనని పరియాచకాలాడింది. అయినా సరే, తనదే రైటనుకున్నాడు. గుణబాలకి తర్వాత పెళ్ళి అయింది. మొగుడితో రెండేళ్ళనుంచీ కాపరం చేస్తోంది. ఇంకా అల్లరేనా ఆ కళ్ళతో!

రామూ పోస్టాఫీసులో వుత్తరాలు పడేసి యింటి వైపుగా మళ్ళాడు. అదృష్ట వశాత్తూ రోడ్డుమీద బాతాఖానీ కొట్టే మిత్రులెవరూ అడ్డలేదు. కాని, అతని బుర్ర మాత్రం భావనా సముద్రంలో ఈతలు కొడుతోంది. ఆ సామాన్యమైన కళ్ళలో తన మనసే అల్లరిని ఆరోపిస్తోం

దేమో! రెండేళ్ళు కాపరం వెలిగించిన గుణబాల, సాధా రణ సంసార స్త్రీ లా. నాన్నపోయి ఆర్నెల్లు అయిందికదా అని, అమ్మని పరామర్శించేందుకు వచ్చివుండవచ్చు. ఏమ యినా, ఈ స్వల్పవిషయాలు తన దృష్టిని ఆకర్షించడం మనో చాపల్యం.

రామూ గేటు తీసుకు లోపల ప్రవేశించే టప్పటికి, అప్పన్న చీడీలమీద కూచుని గోళ్లు గిల్లుకుంటున్నాడు. 'కూరలు తీసుకురావటానికి నాలుగు గంటలికి వెళ్ళి యింత సేపూ ఏం చేస్తున్నావురా!' అన్నాడు అధికారయుతంగా.

"అల్లకల్లోలండి—" అప్పన్న లేచి నుంచున్నాడు.

"మోటారుకింద కుక్కపిల్ల పడిందా?"

"గవనేరుగారో ఎవరో వత్తారని పోలీసోళ్ళు..."

"నువ్వా రోడ్డునే ఎందుకు పోవాలి?...చెట్లకి తోరగా నీళ్ళుపొయ్యి."

అప్పన్న రామూ యింట్లో తన పదకొండో యేట నౌక రీకి కుదిరాడు. ఇప్పుడు వాడికి పదిహేనేళ్ళు. రామూ తండ్రి బతికి వుండగా అప్పన్నకీ ఆయనకీ తరుచు సంఘర్షణ జరు గుతూ వుండేది.

"నౌకరీ వెధవల్ని నెత్తి కెక్కించుకోకూడదు. వాళ్ళని నల్లిని నలిపినట్లు నలపాలి," అంటూవుండే వాడు ముస లాయన.

"వాళ్ళూ మనుషులే!" అనేవాడు రామూ.

వంటయింటి వసారా గుమ్మం దగ్గిర పీటవేసి కూచో పెట్టింది గుణబాలని, రామూ తల్లి సుభద్రమ్మ.

"అదిగో వచ్చాడమ్మా! నీ లాంటి రత్నం లాంటి పిల్ల నా యింట్లో కూడా ఎప్పుడు మసులుతుందా అని దినమూ వెయ్యి దేవుళ్ళకి మొక్కుతున్నాను. అంటే కస్సుమని మీద పడతాడు," అంది సుభద్రమ్మ రామూ సావిట్లో పాదం పెట్టగానే.

"ఏదో అతనే చేసుకుంటాడు. అతనికి మాత్రం తెలీదా—నలుగురికి చెప్పనేర్చినవాడు! మహామహా వాళ్ళు చేసుకున్నారు—పెళ్ళెందుకు చేసుకోడు, మామ్మా, ఖబుర్లు గాని!" రామూకి వినిపించాలనే ఘట్టిగా అంది గుణబాల.

విన్నాడు. విని, వొట్టి చెత్తాకారీ సంభాషణ అనుకుని, తిన్నగా మేడమెట్లు ఎక్కాడు.

"చూశావమ్మా యిదీ తీరు! 'ఏమే బాలా, ఎప్పుడొచ్చావ్!' అని పల్కరించడమూ లేదు, ఏమీ లేదు. ఇంటికి వచ్చినవాళ్ళని పల్కరించకపోతే, వాళ్ళు ఏమన్నా అనుకుంటారురా నాయనా—అంటే; అనుకోనీ—అంటాడు. మరోమరో వ్యాపకం ఏదయినా వుందా అంటే—రామరామ! పుస్తకాలు — చదువు. అంతే. తెల్లవారుజాముదాకా చదువుతాడు. పొద్దున్న పది గంటలకి లేస్తాడు. రాత్రి అవేవో రొట్టెలుతిని, కాసిని పాలు తాగుతాడు 'నీకు

సాలుకి రెండు వేలు వస్తాయి-రొట్టెలు తినడమేమి ఖర్మంరా!' అంటే—నవ్వుతాను. ఇలావుందమ్మా నా బతుకు''

''అధైర్యపడకు, మామ్మా. ఏ ఘడియలో అయినా మారిపోవచ్చు అతనిబుద్ధి, నేను చెప్పిచూస్తా వుండు '' అని వోదార్చింది గుణబాల.

''ఈ కళ్ళతో కోడల్ని చూసే ప్రాప్తంలేదు.''

''అలా అనకు నేను వినిపిస్తాను, చూడు.''

''అంత అదృష్టమే కనక నాకు కలిగితే, నీ కడుపున పుడుతానమ్మా !''

గుణబాల మెట్లు లెక్కపెడుతూ, మేడ ఎక్కి, ద్వారం దగ్గిర నుంచుంది. రామూ టాగూరు Stray Birds చదువుతూ వాలు కుర్చీలో పడుకున్నాడు. గుణబాల గుమ్మం దగ్గిర నిమేషమాత్రం ఆగింది.

''పుస్తకం మొహానికి అడ్డుపెట్టుకున్నావే !''

''లేదు. చదువుతున్నాను,'' అన్నాడు రామూ. 'రా అలావచ్చి కూచో,' అంటూ గుణబాలకి కుర్చీ చూపించాడు. బాల కూచుంది.

''ఈ చదువు నీకు విసుగుపెట్టడంలేదూ ?'' అంది గుణబాల.

''నీ బతుకు నీకు,'' అని అనాలనిపించింది రామూకి. కాని, తమాయించుకున్నాడు,—ఒక లేత హృదయాన్ని

అనవసరంగా శోష్పించడం ఎందుకని, గుణబాల ప్రశ్నకి సమాధానంగా చిరు నవ్వు నవ్వాడు.

రామూకి మాట్లాడేందు కేమీ లేవు. గుణబాలకి మాత్రం ఎన్నో సంగతులు మాట్లాడాలని వుంది కాని, ఎలా కదపడమో తెలీడంలేదు.

వూరుకుని వూరుకుని 'నువ్వు పెళ్ళెందుకు చేసుకోవు?' అంది గుణబాల.

“అవసరమని తోచడంలేదు కనుక.”

“మీ అమ్మని సుఖపెట్టవలసిన బాధ్యత నీ మీదవుంది. నువ్వు పెళ్ళి చేసుకుంటేనేగాని ఆవిడకి సుఖంలేదు.”

“తమ సుఖం యితరుల్లో దాచుకోవడం తెలివి తక్కువ తనం. ఎవరిసుఖం వారి హృదయంలో వుండాలి.”

“వేదాంతం చెప్తున్నావ్!” అంది బాల.

“నువ్వుచూసే సినిమాలు, నువ్వు చదివిన పుస్తకాలూ, యిరుగూ పొరుగూ, నువ్వూ మీ ఆయనా వెళ్ళిన ప్రదేశాలూ—వీటిగురించిన ఖబుర్లు చెప్తూ తమాషాగా వుంటుంది. ఆసక్తితో వింటాను.”

“నే నేదో వాగడానికి రాలేదు.”

“అని నా భావన కాదు, బాలా!”

బాల మొహం మీద మందహాస మొకటి తళుక్కుమంది. నిశ్శబ్దంగా అలా కూచుండి పోయింది. అందమయిన చిత్రంనుంచి కళ్ళు మరలించుకోలేం—హిమాలయాన్ని

చూస్తే మాటలు రావు. గుణబాలకి ప్రశ్నలువేసి అతని చేత మాట్లాడించాలనే కుతూహలం దానంతటదే తగ్గి పోయింది. రామూకి చెప్పగలిగేందుకు తనెవరు ?—తనెంత? ఏదో జ్ఞానదృష్టితో, ఏదో, అర్థంకాని బాధతో, ఏదో మహాసంకల్పంతో, కొట్టుకునే రామూకి తనకి తెలిసినపాటి విషయాలు తెలివా ! తన బతుక్కితోడు తను రామూకి జ్ఞానోపదేశం చేస్తుందా ?

అచేతనంగా ఎంతసేపు అలా కూచున్నారో వారికే తెలీదు. 'వెళ్తాను, బాబూ !' అని ద్వారం దగ్గిర్నుంచి అప్పన్న అనేదాకా వారికి చైతన్యమే కలగలేదు. 'ఊ !' అన్నాడు రామూ, అప్పన్నకి సమాధానంగా.

బయట చీకటి పడింది. పంచమి చంద్రుడి ప్రథమ కిరణాలు గుణబాల కాళ్ళదగ్గిర పడుతున్నాయి, వీధిలో 'మల్లె పూలో !' అంటూ ఎవరో అబ్బి కేకేస్తున్నాడు.

"మల్లెపూలంటే నాకు చాలా యిష్టం," అంది బాల కుర్చీలోనుంచి లేస్తూ.

"కేకెయ్యనా ?"

"ఇవ్వాళవద్దు, రామూ. ఇంకోరోజున పెద్దదండ కట్టి పెట్టుకుంటాను."

"ఇవ్వాళ నేనేదో 'మూడ్'లో వున్నాను. నిన్ను వుత్సాహపరిచే కబుర్లు చెప్పలేకపోయాను."

"రేపు చెప్దువుగాని !"

"వస్తావుగదూ!"

"తప్పకుండా."

గుణబాలని వాళ్ళ పెదనాన్నగారింటి దగ్గిర స్వయంగా దిగబెట్టి వచ్చాడు రామూ. బాలకి భయమని కాదు—ఆ పల్చటి వెన్నెట్లో బాలవెంట నడవడం తమాషాగావుంది రామూకి.

జాజి పందిరికిదగ్గిరగా మంచం వేసుకుపడుకున్న గుణ బాలకి, రాత్రి రెండు గంటలదాకా, రామూ గురించిన తలపులతో నిద్రపట్టలేదు. అతనిమీద అవ్యాజంగా జాలి కలగడం మొదలెట్టింది. ఆ ప్రవాహంలో తను ఏ దరి జేరు తానో అన్న ఆలోచన కలగలేదు.

రామూకి తను ఒక ప్రమాదకరమైన ఆకర్షణలో పడు తున్నాననే ఆత్మజ్ఞానం లేకపోలేదు. వ్యక్తిజీవన పరిణా మానికి సమస్తానుభవాలూ అంగాలుగా తీసుకునే తను ఈ ప్రత్యేకానుభవంనుంచి పిరికిపందలా పారిపోవలసిన అగత్యం కనిపించలేదు. అనురాగంతో దగ్గిరిసా వచ్చి జీవిత సంఘర్ష ణలో ముముక్షుతుందా-అది వో పద్ధతి. తనను ఆదరంతో చూస్తూ ఆప్యాయంగా వుండే స్నేహం చేస్తుందా—అది మరో పద్ధతి.

గుణబాల మనసు తనవేపు మొగ్గిందా? బహుశా మూడేళ్ళనుంచీ తనను లోపల్లోపల ప్రేమిస్తోందేమో! ఆ ప్రేమ వునికి ఆమెకే గోచరం కానంత ప్రబల రహస్యం

కావచ్చు, ధర్మానికీ, కర్మకీ, వ్యతిరేకమైన ప్రేమని ఆహ్వా
నిస్తున్నానా ?

ఆమె మానసిక స్థితేమిటో! భర్తకీ బాలకీ అనురాగం
లేనేలేదా ? కొత్తలోవుండి ఆపైన హుళక్కి అయి
పోయిందా ? ఏమైనా, గుణబాల నాజూకైన మనిషి;
చక్రాల్లాటి కళ్ళతో ముద్దులు కురిపించే అందాలరాణి.

"టీ ఎక్కువగా తాగడంచేత పైత్యంచేసింది. చుట్టపు
చూపుగా వచ్చిన పిల్లగురించి యిన్ని ప్రణయసౌధాలేమిటి?
ఏడ్చినట్టువుంది నా విజ్ఞానం!" అనుకుంటూ తెల్లవారు
జాము నాలుగు గంటలకి కళ్ళు మూశాడు రామూ.

కాని, ఆ రాత్రి బాల రామూ కలలోకి వచ్చింది.
ఏమేమో మాట్లాడింది. ఎన్నెన్నో చేసింది. అతని మంచం
మీద కూచుని......ఒకటే కల !

## 2

కలకాదు. జరిగిన దేమిటంటే: ఉదయాన్నే లేచి గుణ
బాల స్నానంచేసి, కాఫీతాగి, తనకి నచ్చిన చీరె, జాకెట్టూ
ధరించి, రామూ యింటికి ప్రయాణమయింది. వీధిలో డసుకు
పెట్టి ముందుకూచుని కాయితాలు చూసుకుంటున్న రాఘ
వయ్య—అంటే బాల పెదనాన్న–"ఎక్కడికే అమ్మాయీ,
పొద్దున్నే బయలు దేరావు ?"అన్నాడు.

"రామూ యింటికి. చదువుకునేందుకు ఏవయినా పుస్తకాలు తెచ్చుకుంటాను" అంది గుణబాల.

రామయ్య ప్రశ్న వేశాడే కాని, జవాబు అతని చెవుల దాపుకి చేరక పూర్వమే, తన బుర్ర కాస్తా ఆ కాయితాల కట్టలో దూర్చేశాడు. వెధవ ఫైల్సు! ఎంతకీ తెమలవు. డిప్టీ కలెక్టరు మాత్రం రిమైండర్ పైన రిమైండర్ దంచుతూ వుంటాడు.

సుభద్రమ్మ కాకర కాయలు తరుగుతూవుండగా, సావిట్లో పడివున్న 'హిందూ' చేతిలో పుచ్చుకుని గుణబాల వంటింట్లోకి వచ్చింది. "రామూ యింకా లేవలేదా, మామ్మా!"

"అప్పుడే లేస్తాట్టేవాడు!" అంది సుభద్రమ్మ.

"నేను లేపుతాను—ఉండు" అంటూ గబగబా మెట్లెక్కింది బాల. బయట తలుపులు లోపలికి తోసి, లోపలి ద్వారందగ్గర నుంచుని నిద్రపోతున్న రామూ మొహం చూసింది.

ఆమెలో సహజంగాఉన్న చిలిపితనం ఒక్కసారి పైకి వుబికింది. కాయితం చుట్టగాచేసి రామూ చెవులోనో, ముక్కులోనో పెట్టి నిద్రాభంగం చేదామనుకుంది. తప్పి యత్నంలో ఆ విశాలమైన పెద్ద మంచంమీద ఒక పక్కగా కూచుంది బాల.

రామూ కల కరిగిపోయే సమయానికి కలకి జీవం కల్పించే సత్తువతో, తెరుచుకుంటున్న కళ్ళముందు సాక్షాత్కరించింది

గుణబాల, అప్పుడే వికసించిన కలువలా, "అమ్మ దొంగా!" అంటూ ఆమె చెయ్యి పట్టుకున్నాడు రామూ. గుణబాల చేతిలోని కాయితపుచుట్ట జారిపోయింది. అతని స్పర్శతో ఆమె ఒళ్ళు కంపించింది. చర్మంనుంచి రక్తంలోకి ఒక్క ప్రసారం ప్రవహించింది.

"నేను ఒక పావుగంటలో వస్తాను. ఇక్కడే వుండు" అంటూ మంచంమీదనుంచి దూకి, కిందికి వెళ్ళాడు.

రాము పడకగదీ, చదువుకునేగదీ నాలుగు వైపులా చూసింది గుణబాల. వస్తువులన్నీ చిందర వందరగా వున్నాయి. పాపం! ఎవరు సర్దుతారు? మొట్టమొదట పక్క దులిపి శుభ్రంగా వేసింది. కిటికీలోవున్న పూదొత్తుల చెట్టు నిలబెట్టి, సొరుగులో వున్న అగరొత్తులు నాలుగు అందులో వుంచి వెలిగించింది. చదువుకునే గదిలో అటూయిటూ అడ్డంగావున్న కుర్చీలు క్రమప్రకారం వుంచింది. టేబుల్ మీదవున్న చెత్త అంతా సొరుగుల్లో దాచింది. తన చేతి కందినవన్నీ బుద్ధికి తోచినట్లు మార్చింది. పావుగంటలో వస్తానన్న రామూ అరగంట గడచిన తర్వాత యిడ్డెనుల పొట్లంతోనూ, కాఫీ ఫ్లాస్కుతోనూ వచ్చాడు.

"సువాసనలు వెదజల్లుతున్నావే!"

"చూడు యిలా పరిశుభ్రంగా వుండాలి యివన్నీ" అంటూ తను సర్దినవిచూపించింది బాల.

ఇద్దరూ యిడ్లెన్లు తింటున్నారు. 'మామ్మ పెద్దదవుతోంది. ఈ యిల్లూవాకిలీ కనిపెట్టేందుకు ఎవరైనా ఆడది కావాలి. నువ్వు పెళ్ళిచేసుకోనంటావు. పోనీ, ఎవరైనా అమ్మాయిని...'

గుణబాల నాలిక కొరుక్కుంది. ప్రవేశించ కూడని ప్రాంగణాల్లోకి చొరబడుతోంది.

"వాళ్ళ వాసంతి బి. ఏ. పాసైందిగా!" అంది బాల.

"ఆమెకి పెసరట్లు చెయ్యడం బాగా తెలుసు - వాళ్ళ నాన్న పొరబాటున బి. ఏ. చెప్పించాడు. ఆమె ఒకటో రకమైన వంటమనిషిగా రాణిస్తుంది." అన్నాడు రాము.

"నీకు నచ్చేపిల్ల యీ మూళ్ళోకాల్లో ఎక్కడైనా వుందీ?"

"వుండదు."

"నీకు యిరవైమూడేళ్ళు వచ్చాయట. మామ్మ 'బెండకాయ ముదిరినా, బ్రహ్మచారి ముదిరినా'—అంటుంది."

"నేను బ్రహ్మచారిని కాదు, బాలా!"

"పెళ్లాం లేదుగా!"

ఇద్దరూ ఫక్కున నవ్వుకున్నారు. ఇంకో అరగంట పిచ్చాపాటి మాట్లాడిన తరువాత గుణబాల, 'పెదనాన్న భోజన వేళవుతోంది — నేనుకూడా వేళకి వెళ్తే, అమ్మకి తేలిక — నాకు చదువుకునేందుకు మంచి పుస్తకం యియ్యి - వెళ్తాను' అంది.

"ఏం పుస్తకం యిచ్చేది ?"

"నువ్వే నిర్ణయించు."

తెలుగు పుస్తకాల బీరువా తాళంతీసి తలుపు తెరిచాడు రాము. దాన్నిండా పురాణాలూ, నవలలూ, కథలూ, శాస్త్రగ్రంథాలూ పత్రికల బవుండ్లూ వున్నాయి. ఆకలితో వున్న మనిషి పంచభక్ష్య పరమాన్నాలూ చూసినట్లు చూసి, 'రామూ ఇవన్నీ నువ్వు చదివేశావా ?' అంది గుణబాల.

రామూ చిరునవ్వుతో 'కొన్ని చదివాను, ఇంకా కొన్ని చదవాలి !' అన్నాడు.

గుణబాల వెనక పంక్తిలోవున్న ఒక పుస్తకం మీద చెయ్యివేసి, అది తియ్యమంది. రామూ ఆ పుస్తకం తీయడంలో అతని వాచీకి యీామె గాజులు తగిలాయి – కళ్ళు కళ్ళలోకి చూశాయి.

"బాలా!" అంటూ ఆమెని తనదగ్గిరిగా అదుముకున్నాడు రామూ. బాల కనురెప్పలమీాద ముద్దులు రాలిపోయాయి. ఆమె కళ్ళు అనిర్వాచనీయానందంతో మూసుకున్నాయి. ఆమె బాహు వల్లరి రామూ మెడని పెనవేసుకుంది.

ఇద్దరికెసీ పడక గదిలోని ఆ విశాలమైన మంచంపిలిచింది. నీతిభావమూ, భయమూ, బాల మనస్సులో లేనే లేవు. తన నిమిత్తంతో ప్రమేయంలేని శక్తికిలోబడి నడుస్తోంది ఆమె.

"బాలా, నీకోసం మేఘాల్లోనూ, పుస్తకాల్లోనూ నీటి కెరటాల్లోనూ వెతికాను. నువ్వెక్కడో వున్నావనుకున్నాను - నాకెంతో దగ్గరసా వున్నావు - ఇన్నాళ్ళూ చూడలేక పోయాను."

బాల కిలకిలా నవ్వి రామూ రెండు బుగ్గలూ కొరికింది; రామూ కితకితలు పెట్టాడు. ఆమె ఎగిరెగిరి నవ్వుతూ పక్కమీదికి జారింది. పైట తొలిగింది. ఇక మాటలు లేవు.

మధ్యాహ్నం ఒంటిగంటకి మేడ మెట్లు దిగుతున్నప్పుడు గుణబాల, 'రామూ ఎంత సౌఖ్యం చేతులారా పోగొట్టుకుంటున్నావో తెలుస్తోందా!' అంది.

"ఇక పోనివ్వను - ఈ బాల నాదే!"

"నేను నీదాన్ని యెలా అవుతాను, వెర్రివాడా!"

ప్రశ్నార్థకంగా మొహంలోకి చూశాడు—బాల అలిసిన కళ్ళు నవ్వాయి.

పెత్తల్లి వెండిపళ్ళెంలో అన్నం పెడుతూ, 'అదేమిటే అమ్మాయ్! ఇంతసేపూ కూచుని పుస్తకం తెచ్చుకోవడం మర్చిపోయావు" అంది. ఆవిడ ఆవులిస్తే పేగులు లెక్కపెట్టే రకం—బాల రేగినజుట్టూ, నలిగినచీరె చూసీ చూడగానే ఆమె కన్నీ అర్థమైపోయినై — సుభద్రమ్మలాంటి సత్తెకాలపు మనిషి కాదు—తన కొడుక్కి పెళ్ళి బోధనలు చేస్తోందనేందుకు. ఆపూట గుణబాల వంచిన తల యెత్తకుండా అన్నం తింది.

గుణబాల చిన్నప్పట్నుంచీ అదుపూ, ఆజ్ఞా లేకుండా పెరిగిందనే అనవచ్చు. ఆమె తల్లి నాలుగో ఏట చచ్చిపోయింది. అప్పట్నుంచీ పెళ్ళయ్యేదాకా యిక్కడ కొన్నాళ్ళూ, అక్కడ కొన్నాళ్ళూ, ఎక్కడా స్థిరత్వం లేకుండా గడిపింది. తల్లిలేని బిడ్డగదా అని కొంత లోకువ చేసినా, ఎవరికి వారు తమకేమన్నట్లు ఆ అమ్మాయిని కసిరేవారు కాదు. ఒక్కగా నొక్కపిల్ల—తల్లిలేనిదీ—అవడంవల్ల, తండ్రి సంసారం చట్టుబండలూ లేనివాడు కనక, తనదగ్గిర వుంచుకో లేకపోయినా ఆమెకు డబ్బూ దసకం యివ్వడంలోగాని, చీరె, జాకెట్టూ కొనడంలో కాని వెనకాడే వాడు కాదు.

శిక్షణ అనేది బొత్తిగా లేకపోవడంవల్ల నోములూ వ్రతాలూ చేసుకొనేవారిని వేళాకోళం చేసేది బాల. ఈ మూఢ సాంప్రదాయా లన్నిటినీ ఆక్షేపించే జ్ఞానం ఆమెకు వుందా?—అంటే వుండికాదు. ఈమె బుద్ధిని పైనున్నవా రెవరూ నలిపెయ్యలేక పోవడంవల్ల దానంతటదే స్వాభావికంగా ఎదిగింది. మడీ ఆచారం అంటే వెక్కిరిస్తుంది. శుభ్రత మాత్రమే కొంతవరకు తెలుసు గుణబాలకు.

ఈ పెంపుకులో సగం బాధ్యత పెద్దమ్మ శ్యామలాంబ మీద వుంది. చెల్లెలు కాలంచేసిన పదిహేనోరోజున, మరిదిని అతి ప్రయాసతో ఒప్పించి, గుణబాలని తన వెంట తీసుకువచ్చింది. ఇప్పుడంటే యిద్దరు పిల్లలు వున్నారుగాని-

అప్పటికి అంటే పదకొండేళ్ళ కిందటి మాట—శ్యామలాంబ కడుపు కాయలేదు. చెల్లెలంటే ఎంతో ప్రీతి. చచ్చిన చెల్లెలికి తనేం చెయ్యగలదు—ఆమె బిడ్డని ప్రేమతో పెంచడం కంటె! వీటన్నిటితోనూ గుణబాల గారాబాల పట్టి అయింది—ఇంకావుంది.

రామ్మూర్తి—అనగా గుణబాల తండ్రి — మొదటి పెళ్ళాం గతించాక—ఎవ రెన్నివిధాల చెప్పినా, తిరిగీ పెళ్ళి చేసుకోలేదు. కోయంబత్తూరులో నెలకి తొంభై రూపాయిలు తెచ్చిపెట్టే గవర్నమెంటు వుద్యోగంతో కాలం గడుపుతూ న్నాడు. ఇక, రాఘవయ్యకి తన కాయితాల గొడవలేగాని సంసార తాపత్రయం అక్కర్లేదు. ఒకటోతారీఖు సాయంత్రం ఆ యెనభైనాలుగు గవ్వలూ తీసుకొచ్చి శ్యామలాంబ చేతిలో పోస్తాడు. వీరుగాక గుణబాలకి ఇద్దరు మేనమామలు వున్నారు. ఒకరు నైజాంలోనూ, మరొకరు ఓఢ్ర దేశం లోనూ వున్నారు.

మేనమామ లింటికి ఆమె చుట్టపు చూపుగానే వెళ్ళేది. పెద్దచేసి ఒక అయ్యచేతిలో పెట్టినది శ్యామలాంబే! అంచేత ఆమెకి అమ్మంటే యెంతచనువో అంత భయం కూడాను!

శ్యామలాంబ ఒట్టి మూర్ఖురాలు కాదు. మంచి చెడ్డలు నిశితదృష్టితో చూసేమనిషి. రాముకీ యీ కుటుంబానికీ కూడా ఏదో బీరకాయపీచు సంబంధం వుంది. రాముడూ మంచి

కన్రాడు—చక్కగా మాట్లాడుతాడు...అంత కోరిక మనసులో వుంటే గుణబాలని తనే ఎందుకు పెళ్ళిచేసుకో లేకపోయాడు ?

కాని మాట కస్పష్టాలి కనక, శ్యామలాంబ తన అనుమానాన్ని కడుపులో దాచుకుంది. పిల్లని రొష్టుపెడితేనూ, కూకలేస్తేనూ కలిసొచ్చేదేమిటి ? తను అనుకోకుండా వుపద్రవం నెత్తినిపడింది. పదిలంగా ప్రమాదం నించి తప్పించాలి. అయినా చిన్నపిల్లా, ఏమన్నానా ? రెండేళ్ళనుంచీ కాపరంచేస్తున్న దానికి ఆ సాధక బాధకాలు తెలీవ్యా ? నెలాఖరికి దాని మొగుడు వచ్చి ఎలాగా తీసుకుపోతాడు. ఈ కాస్తలో దాని మనసు తినెందుకు నొప్పించాలి ?

"అదేమిటమ్మా, శ్యామలాంబగారూ, మీ అమ్మాయి ఒక్కక్షణం యింట్లో వుండదు" అంది పదిరోజులు గడిచిన తరువాత పక్కింటావిడ.

"పిల్లలు బళ్ళోకిపోతే దాని ఒక్కర్తికీ ఏమితోస్తుందనీ—సుభద్రమ్మ వొదిన యింటికెళ్ళి ఏదైనా పుస్తకం తెచ్చుకోమని, నేనే యిప్పుడిప్పుడే పంపించాను" అంది శ్యామలాంబ.

"అలాగా !" అంది పక్కింటావిడ, మాటలు చచ్చి.

సాయింత్రం ఏడున్నరకి యింటికి వచ్చింది గుణబాల, నిద్దర నుంచి లేచిన మొహంతో—'అదేమిటే మరీ యిదై పోతోంది.

కాఫీకి రావడం కూడా మర్చిపోయాన్! ఏం బావో లేదమ్మా-యిది."

గుణబాల సమాధానం ఏం చెప్తుంది?

"ఆడపిల్లవి—అప్రతిష్ట పడిపోవ్వూ?... మొగవాడు—అతనికేం, మహారాజు!—శుభ్రంగా కాపరం చేసుకోవలసిన దానివి, నీకు యిలాంటి బుద్ధులు పుట్టా వేం?"

"ఏం బుద్ధులు, అమ్మా!"

"ఎలా అడుగుతావే, నంగనాచిలా!"

రెండుకళ్లూ వప్పజెప్పి, విస్తుపోయి నుంచుంది గుణబాల. వేడివేడిబొట్టొకటి గచ్చుమీద రాలింది.

శ్యామలాంబకి చెల్లెలు జ్ఞాపకం వచ్చింది. అమాంతంగా కూతుర్ని దగ్గిరిసా తీసుకుంది. ఆ సాయంత్రం ఆఫీసునుంచి వస్తూ రాఘవయ్య చేతిలో ఒక కవరు పుచ్చుకువచ్చాడు. ఏముంది అందులో?

## 3

ఏముందా? తను పై నెలాఖరువరకూ మీరట్‌లోనే ఉండాలనీ, అప్పటికిగాని హైదరాబాదు ట్రాన్స్‌ఫర్ కాదనీ, అంతవరకూ బాలని రాఘవయ్యగారి యింట్లోనే ఉండి ఆరోగ్యం పదిలంగా చూసుకుంటూ, డాక్టర్ చెప్పినట్లు

ఔషధం సేవిస్తూ వుండమని బాలభర్త "భానుమూర్తి" రాశాడు. ఉత్తరం విని శ్యామలాంబ అంది, "జబ్బేమిటే!"

"నాకుమాత్రం ఏం తెలుసు అమ్మా! ఆయన ఒట్టి ఖంగారుమనిషి. చింతకాయపప్పో, కొబ్బరికాయ పచ్చడో వేసుకున్నాడు కాస్త దగ్గితే హడిలిపోతారు. పీలగా సన్నంగా వున్నానట లావయ్యేందుకు, బలం వచ్చేందుకూ ఏదన్నా టానిక్ పుచ్చుకోవాలట. నావళ్ళు సాయంత్రంవేళ వెచ్చగా వుంటుందట. అలావుండటం మంచిది కాదట. ఏం మంచో గడమంచి," అంటూ నవ్వేసింది గుణబాల.

"అమ్మాయి మాటలు బాగా నేర్చుకుంది," అన్నాడు రాఘవయ్య.

"మాటలేం—అన్నీను," అంది శ్యామలాంబ వ్యంగ్యంగా. సూటిగా చెప్తేనే తెలిసి ఏడవదు తాలూకా గుమాస్తాకి,— యింక వ్యంగ్యాలూ, ఛలోక్తులూ ఏం తెలుస్తాయి!

"రేపు పొద్దున్న కాస్త తెరిపిచేసుకుని ఆ డాక్టర్ని పిలుచుకురండి. అమ్మాయిని చూపిద్దాం!" అంది శ్యామలాంబ, ఆ రాత్రి అన్నాలు వడ్డిస్తూ.

"డాక్టరెందుకే, అమ్మా!" బాల అడిగింది.

"నీ మొహం! వూరుకో," అంటూ శ్యామలాంబ గదమాయించింది.

మర్నాడు వుదయం ఎనిమిదిన్నరకి డాక్టరు స్టెతస్కోపుతో తయారయాడు. గుణబాల కళ్ళూ, నాలిక, చర్మం

పరీక్షించి, డాక్టర్ ప్రశ్నలన్నీ వేశాడు. వూపిరితిత్తులు చూశాడు.

చివరికి తేల్చిన సారాంశం యిది: "అమ్మాయి వొంట్లో రక్తం తక్కువగావుంది. వూపిరితిత్తులు నీరసంగావున్నాయి. విశ్రాంతీ, చల్లగాలీ అత్యవసరం. సరిగా శ్రద్ధతీసుకోక పోతే .. పేర్లెందుకు లెండి! అబ్బాయిని నీసాయిచ్చి పంపించండి, మందు పంపిస్తాను. మూడురోజులకో యింజక్షన్ యివ్వాలి. పొద్దున్నే కోడిగుడ్డూ, రాత్రి పావుసేరు పాలూ, ఆకు కూరలూ, పెరుగూ..."

డాక్టర్ వెళ్ళిపోయిన తర్వాత గుణబాల ఒకటే నవ్వు! 'ఇన్నితింటే నేను సుబ్బమ్మత్తలా పిప్పళ్ళ బస్తా నయిపోతాను" అంటూ విరగబడి నవ్వింది, శ్యామలాంబ వారించే దాకా.

ఆ మధ్యాహ్నం రామూతో డాక్టరురాక ఒక ఫార్సుగా చెప్పింది. తను యింకో నెల్లాళ్ళు వుంటాననే శుభవార్త కూడా అతని చెవిలో వూదింది.

"బాలా, నువ్వు వెళ్ళిపోతే నేను బతకడం ఎలా?"

"ఇంకో నెలరోజులు వుంటానుగా!"

"ఆపైన అయినా వెళ్ళిపోతావు."

"వెళ్ళక...నామీద అంత మక్కువ వుంటే పెళ్ళి చేసుకోక పోయావ్! మీ యింటి చుట్టూ ఎన్నిసార్లు తిరిగే దాన్ని. రామూ! నువ్వు వట్టి క్రూరుడవోయ్!"

"అప్పను, శాలా, నామూపే అమృతంగా భావించే మనుషుల్ని ధిక్కరించి, మేఘమండలంలో విహరించే ప్రియురాలికోసం చేతులు చాపాను. ఆమె మేఘాల్లో లేదు. మేఘాలు వర్షరూపం దాల్చాయి. మేఘసందేశాన్ని వినే సత్తువలేక వర్షంలో తడిశాను. తడిబట్టలతో వొణుకుతున్న నాను నీ వెచ్చటి హృదయాన్ని ప్రసాదించావు, శాలా!"

పెట్టుబడిదారీ విధానంలో, సాలీనావచ్చే రాబడితో, కాలాన్ని పొద్దుపోగొట్టేవాడు కనకనే, రామూకి యిలాంటి పగటికలల అవకాశం ప్రాప్తించింది. బాల భర్త భానుమూర్తికి రెక్కాడితేగాని డొక్కాడదు.

"మా ఆయన్ని చూశావుగదూ నువ్వు!... నా పెళ్ళికి రాలేదుగా!"

"రాలేదుగాని, మీ ఆయన్ని రాఘవయ్యగారింట్లో చూశాను."

"మా ఆయనికి నేనంటే ఎంతో ఆపేక్ష. ఆయనికి తండ్రీ, అన్నదమ్ములూ, అప్పచెల్లెళ్ళూ ఎవరూ లేరు. అన్నీ నేనే! ఆయన పంచ ప్రాణాలూ నామీదే వుంటాయి."

"అలాంటి నువ్వు నాదానివై పోయావ్!"

"కాని, ఆయన భార్యనిగా!"

"నామమాత్రంగా—"

"రూలుప్రకారం."

గుణబాల రామమూర్తి కళ్ళల్లోకి తలపెట్టుకు పడుకుంది అతని ఆకలి కళ్ళల్లోకి తీక్షణంగా చూస్తూ అంది. 'రామమూ నువ్వు ఎవర్నయినా పెళ్ళి చేసుకోకూడదూ ? సహజమైన కోర్కెల్ని చంపుకు, ఏం సాధిస్తావ్ !''

''అభ్యంతరం లేకపోతే విన్ను చేసుకుంటాను''

''నన్నా ?''

''అవును''

''ఎలా సాధ్యపడుతుందీ ?''

''సంకల్ప మనేదివుంటే మార్గాలు అనంతం.''

''భానుమూర్తిగారో ! అంది గుణబాల.

''నీ మాటలేగాని, భానుమూర్తెమిటో నాకు తెలీదు, భానుమూర్తిమీద అసహ్యం కలగడ మనేది సంభవిస్తే నే. నాదగ్గిరికిరా.''

''కలగదు.''

''కల్గకపోతే యిబ్బందే లేదు.''

''మరి, నీపెళ్ళి ?''

''నా పెళ్ళిగురించి నీ కెందు కంతదిగులు ? వివాహం రమ్యలోకాలకి తీసుకొనిపోయే వెలుగు లా వుండాలిగాని, బంధనగా వుండకూడదు. సాంప్రదాయ సూత్రాలతోనూ కులమర్యాదలతోనూ కట్టేసే బందిఖానాలో సౌఖ్యం ఎలా వుంటుంది బాలా ?''

''నువ్వు చిన్నప్పుడు ఎవర్నో ప్రేమించావుకదూ ?''

"అవును."

"నిరాశ చెందావుకదూ ?"

"కొంతవరకు వాస్తవమే ! రూపాల్లో వుండే తత్వాన్ని తెలుసుకోలేక, రూపాల్ని పట్టుకుని దేవులాడినన్నాళ్ళూ నిరాశతప్పదు శీల అనే కాలేజీపిల్లని నా హృదయమంతటి తోనూ ప్రేమించాను. ఆమె నాతో చెలగాటమాడింది. చిట్టచివరికి నాకు లోబడింది అతి సన్నిహితంగా వచ్చింది. ఎన్నో కోర్కెలు రేపింది; కలలు కల్పించింది; మనసులో లోకాలుసృష్టించింది. ఇద్దరం కలిసి హరిజనసేవ చేదామనీ, దేశసేవకి జీవితాలు అర్పిద్దామనీ, ప్రజల్లోని అజ్ఞానాన్ని తుడిచే విజ్ఞానపు అక్షింతలు చల్లుదామనీ, సంఘాన్నీ దేశాన్నీ లోకాన్నీ సుత్తీ కొడవలీ పుచ్చుకు మరమ్మత్ చేదామనీ ఎన్నో కాంక్షించా . ఆ కాంక్షాకుసుమములు శీల కాలగతిలో కలిసిపోవడంతో వాడిపోయాయి. జీవితమంటే యిలాంటి సుందరస్వప్నాలు కావని బోధపడింది."

గుణబాల వళ్ళోనుంచి లేచికూచుని వింటోంది. శీల తన బతుకుబాటలో చల్లిన రంగవల్లిని చెపుతున్నాడు రామూ.

"అలాంటి వజ్రాన్ని పోగొట్టుకున్న నేను ఒక పతివ్రత మాంగల్యంలో శాంతిని వెతికేదా ? ప్రేమ అనుభవించిన వాడికే వియోగానికీ నిరాశకీ అర్థం తెలుస్తుంది. బాలా, నా ప్రియురాలు యిది," అంటూ పక్కగా పడివున్న

'మోడరన్ ఫిలాసఫీ' మాపించాను. 'యీ ప్రియురాలితో బాల పోటీ చేస్తోంది.'

"ఇంకెప్పుడూ నిన్ను పెళ్లిచేసుకోమని అడగను, రామూ !"

"అడిగినా నాకు కోపంరాదు, బాలా !" అంటూ ఆమెను తనవళ్ళోకి తీసుకు ముద్దాడాడు.

"బాబుగోరూ శ్యామలాంబగారి దాసీది అమ్మాయిగారి కోసం వచ్చింది" అంటూ అప్పన్న ద్వారందగ్గిర నుంచు న్నాడు.

"ఇంకాసేపు వుండి వస్తుందని చెప్పు" అంటూ అప్ప న్నని పంపేశాడు రామూ.

తొరగా వెళ్ళకపోతే మా అమ్మకూడా వస్తుంది నా కోసం."

"అప్పుడే వెళ్ళిపోతావా ?"

"ఇవ్వాళిటికే. రేపట్నుంచి నన్ను కోరకూడదు. మందు పుచ్చుకుంటున్నాను."

"అలాగే! సీ ఆరోగ్యం కంటె యెక్కువా ? ఆత్మ సంయోగంలో దేహాలు నిద్రపోలేక యీ అల్లరి చేస్తు న్నాయి. స్వభావాలలో వుండే సాపత్యంవల్ల కుదిరిన మన అన్యోన్యతలో దేహాల స్థానం స్వల్పం. వయసువల్లా, పరిస్థితులవల్లా ఆ నరాలకోంపలు మన ఆత్మల్ని అప్పు డప్పు డలా పీడిస్తూ వుంటాయి."

బెదురుతూ గుణబాల యింట్లో అడుగుపెట్టింది. శ్యామలాంబ కిక్కురుమనలేదు. సావిట్లో తివాసీమీద కూచున్న అమ్మాయి ముందు బజ్జీలతో గాజుప్లేటూ, మంచినీళ్ళ గ్లాసూ, కాఫీప్లాస్కూ వుంచింది. కరకరలాడే ఆకలితో వున్న బాల బజ్జీలు మింగి, ప్లాస్కు కాళీ చేసింది. రాత్రి నిద్రపోయేముందు కాబోలు సౌమ్యంగా అంది శ్యామలాంబ : 'గుణా—మరీ చిన్నతనంలో పడకమ్మా ! నీవొళ్లు చూసుకో.''

అమ్మని కౌగలించుకోవాలన్నంత అభిలాష కలిగింది గుణబాలకి.

''రేపట్నుంచి జాగ్రత్తగా వుంటాను, అమ్మా !''

వుందా ? ?

# 4

ఉంది. మర్నాడు, మూడోరోజున కూడా గుణబాల రామూ గుమ్మం తొక్కలేదు. నాలుగోనాటి మధ్యాహ్నం లైబ్రరీనుంచి వస్తూ 'అత్తా !' అంటూ రామూ రాఘవయ్యగారింటికి వచ్చాడు. అప్పుడే కడిగిన వెండికంచాలు చేతిలో పుచ్చుకొని, దొడ్లోనుంచి వస్తున్న శ్యామలాంబ రామూని ఉద్దేశిస్తూ 'కూచోవోయ్ ! మా యింటి చాలికే రావడం మానేశావ్ !' అంది.

"వచ్చావుటా."

"గుణ పడక్కదిలో లేదూ?" అంటూ శ్యామలాంబ లోపలికి వెళ్ళింది. 'పక్కవాటావారింట్లోకి వెళ్ళింటుంది. 'గుణా!' అంటూ కేకేసింది శ్యామలాంబ.

ఎక్కణ్ణుంచి ప్రాదుర్భవించిందో పరిగెత్తుకుంటూ వచ్చి సావిట్లో వాలింది గుణబాల. తివాసీమీద కూచున్న రామూకి ఎదురుగా చాప పరుచుకు కూచుంది.

"వొట్టి అర్భకనాకారి పిల్ల, నాయనా. దాని బాగోగులు దానికే తెలీవు. ఎలా బతుకుతుందో! గుమ్మందగ్గిర చతికిల పడుతూ అంది శ్యామలాంబ.

ఒక అరగంట మాటామంతీ మాట్లాడిన తర్వాత శ్యామలాంబ తన పనిమీద తప్పుకుంది.

"చూసి చూసి కళ్ళు కాయలు కాచాయి," అన్నాడు రామూ.

"ఇవ్వాళే వద్దామనుకుంటున్నాను."

"నిన్నా మొన్నా?"

"మందు పుచ్చుకుంటున్నానని చెప్పలేదూ?"

"కాసేపు కబుర్లు చెప్పుకోవచ్చుగా?"

"ఏమో! ఆపైన నువ్వు బాధపడితే..."

"ఈ మాత్రానికే. సాయంత్రం మంచి రేడియో ప్రోగ్రాం వుంది—ఏడుగంటలకి రా."

అలాగేనని తలవూపింది గుణబాల.

రామూ ఒక రకంగా అదృష్టవంతుడు. పట్టున పాతికేళ్లు లేవు. బోలెడంత ఆస్తి తండ్రి మరణంతో చేజిక్కింది. సంసార బాధ్యతలు లేవు; తెలీవు. పట్నవాసంలో డబ్బువల్ల పొందగలిగే వసతులన్నీ అతనికున్నాయి. మనసులో ఏవో వెర్రి ఆశయాలు మినహా పైకి అంతా నవ్యంగానే కనిపిస్తుంది.

సాయంత్రం ఏడైంది. అగరుధూపంతో రామూ రాసుకున్న వట్టివేళ్ళ అత్తరువు పేచీపడుతోంది. గుణబాల తెల్లటి చీరె కట్టుకుని, మల్లెపూదండ నాజూగ్గా జడలో యిమిడ్చి, రాఘవయ్యగారి రెండో కొడుకైన గోపీని వెంటబెట్టుకొని వచ్చింది. మేడమెట్లు ఎక్కబోతూ వుండగా సుభద్రమ్మ 'రెండు రోజుల్నించీ కనిపించడం లేదేమే అమ్మాయి!' అంది.

గుణబాల జవాబు చెప్పకపూర్వమే, అంతవరకూ సుభద్రమ్మతో తన సొద ఏకరువు పెడుతున్న పొరుగింటి ఇల్లాలు, "అమ్మాయి పడక కూడా యిక్కడేనా!" అంది.

"మాయింట్లో ఎందుకు పడుకుంటుందమ్మా వాళ్ళ పిన్తల్లి వుండగా!" అంది సుభద్రమ్మ, ఆ వెటకారాన్ని తెలుసుకోలేక.

గుణబాల మాత్రం ఛెళ్ళున చెంపకాయ కొట్టినట్లు ఆ పొరుగింటి ఇల్లాలువంక చురచుర చూసింది. సాయిబుతో లేచిపోయిన ఆ ఇల్లాలి రెండో కోడలు జ్ఞాపకం వచ్చేటంత తీవ్రంగా చూసింది.

"శాడీగాడ్ని వెంటబెట్టుకు వచ్చావే!" అన్నాడు గోపీని చూడగానే రామూ,

"కాదు. వస్తానని వెంటబడ్డాడు," అంది బాల గోపీని చూపిస్తూ.

"మామ యింటికి వచ్చాడా?"

"అప్పుడేనా ? ఎనిమిదవాలి."

గుణబాలని రప్పించడమే ప్రత్యేకమైన విషయం కాని, రేడియోలో ప్రత్యేక ప్రోగ్రాంలేదు. కాసేపు రేడియో ఏవేవో పాటలు పాడింది; వార్తలు చెప్పింది; మార్కెట్ ధరలు విన్నవించింది.

"ఆకలవుతోంది—ఇంటికి పోదాం, అక్కా" అంటూ మొదలెట్టాడు గోపీ.

"బాబుగారూ, వెళ్తాను" అని సెలవుతీసుకునేందుకు వచ్చిన అప్పన్నకి వప్పజెప్పాడు గోపీని రామూ, గోపీ యిబ్బంది తీరిపోయింది.

ఏడున్నర అయింది. బయట చీకటి అలుముకుం టోంది. గుణబాల తలలోని మొగ్గలు మరికొంత పరిమళాన్ని పంచి పెడుతున్నాయి. పడక గదిలోని నారింజపండు రంగు దీపం మహామిడిసిపడుతోంది.

"ఇక నేను వెళ్తాను," అంది బాల,

"నిన్ను వెళ్ళనియ్యను."

"ఎప్పుడో కట్టేసుకున్నావ్," అంటూ తమాషాగా తలతిప్పింది బాల.

"చెప్పడం మర్చిపోయాను—ఇవ్వాళ మా ఆయన దగ్గిర్నుంచి ఉత్తరం వచ్చింది. పదిహేనో తేదీకి హైద్రాబాద్ వస్తారట. నన్నక్కడికి పద్ధెనిమిదికి రమ్మన్నారు," అంది గుణబాల.

"వెళ్తావా ?"

"ఊఁ !"

"డాక్టరు అంగీకరిస్తాడా ? నువ్వు మళ్లీ సంసారంలో పడితే అనుపానం, పత్యం ఎలా జరుగుతాయి ? నాలుగైదు నెలలు యిక్కడేవుంటే మంచిది."

"నన్ను పెంచి పెద్దచేసిన అమ్మే కావచ్చు. కాని, యింకోళ్ళ యింట్లో వుండటమనే లోతు పాతులు ఆడదానికి గాని, నీకు తెలీవు, రామూ !"

"అత్త చాల సున్నితమైన మనిషే."

"అయినాను."

"పోనీ—మాయింట్లో వుండిపో !"

"అలాగే వుంటాను," అంది బాల నవ్వుతూ.

"పన్నిరాత్రి ఇక్కడ బంధించేశా ననుకో."

"బంధించట మెందుకోయ్, రామూ. నువ్వు వుండమంటే, నేను వెళ్లగలనా ?"

రామూ వుండమని కోరలేదు. కొత్తరుచి మరిగిన అతని దేహం ఆమెని తీవ్రంగా కోరింది. ఆ వాంఛని ఏ శక్తిసాయం

వల్ల విరోధించగలిగాడో రామూకే తెలీదు. స్వయంగా తీసుకువెళ్ళి రాఘవయ్యగారి [illegible]దగ్గర దిగబెట్టాడు.

బాలకి రామూతో వెనక్కి వెళ్ళాలనిపించింది. కాని, ఓర్పు తెచ్చుకుంది. ఆనాటినుంచీ రామూ అనే ప్రియుడు తనకి దొరికినందుకు గుణబాల మురిసిపోయేది. ప్రథమ సమాగమంలోని తృప్తిని మించిన ఆనందం ఈ నిగ్రహంలో ఆమెకి కనిపించింది.

తన ప్రియుడు సాధారణుడు కాడు. అతీతుడు. మానవాతీతుడు. తన అదృష్టంవల్ల తనకి లభించాడు. ఎంత పదిలంగా కాపాడుకుంటుందో! మిగతా మనుషు లెక్కడ? ఇత నెక్కడ? 'ప్రియా! ప్రియా!' అని ఆమె తనలో తనే మూలిగింది.

డాక్టరు నాలుగు నెలలైనా మందు తీసుకోవాలనీ, ఆ వూళ్ళోనే వుండాలనీ అన్నాడు. గుణబాలకి అక్కడ వుండటం సుతరామూ యిష్టంలేదు. మొగుడి దగ్గర వుండ కూడదన్నాడు డాక్టర్. ఏం చెయ్యడానికీ తోచలేదు. భానుమూర్తిని, హైద్రాబాద్‌లో చేరేముందు, తనని ఒక సారి చూసి వెళ్ళవలసిందంటూ వుత్తరం రాసింది.

భానుమూర్తి వచ్చాడు. అతనికీ రామూకీ స్నేహం ఈసారి దానంతటదే కుదిరింది. రాజకీయాలూ, సాంఘిక విషయాలూ గంటలకొద్దీ చర్చించేవారు. భార్య మాటల్ని బట్టి భానుమూర్తి ఆమెకి రామూమీదవున్న అభిమానాన్ని

గ్రహించలేక పోయేము. తెలిసీ కలిగేపాటి వ్యవధి కానీ అవకాశం కానీ అతనికి లేవు.

"నువ్వు ఇంకో రెండు నెలలపాటు యిక్కడే వుంటే చాలా బాగుంటుంది, గుణా!" అన్నాడు భానుమూర్తి.

"నా కిక్కడ వుండాలని లేదండీ. ఏమయితే అది అవుతుంది—మీతో వచ్చేస్తాను."

"ఇప్పటికే నీ ఆరోగ్యం విషయంలో వుపేక్ష జరిగిందంటున్నాడు డాక్టర్. యింకానా?"

"ఇక్కడ వుండాలని నాకు లేదు."

"రామూ మీద నిజంగా యిష్టంవుంటే ఇక్కడ వుండనని ఎందుకు మారాం చేస్తుంది?" అనుకున్నాడు భానుమూర్తిలోని భర్త.

"పోనీ బరంపురంలో మీ మామయ్య ఇంటిదగ్గర వుందువుగాని."

"ఊహు!" అని నిరాకరించింది గుణబాల.

మర్నాడు మధ్యాహ్నం రామూ మేడమీద ముగ్గురూ కూచుని వుండగా యీ ప్రస్తావనే వచ్చింది.

"చూడండి, రామూగారూ, ఇక్కడ వుండనంటుంది. మామయ్యదగ్గరికి వెళ్ళనంటుంది. డాక్టర్ కాపరం పెట్టకూడదంటాడు. ఏంచేసేది?" అన్నాడు భానుమూర్తి.

"చిన్నప్పట్నుంచీ యీావిడ తంతు అంతేలెండి" అన్నాడు రామూ.

"చిన్నప్పట్నుంచీ నన్నెరుగున్నట్లు—మీ పక్కింట్లో వున్న ఆయన పేరు నీకు తెలీదుగాని!" అంది గుణబాల.

"రామూకి ఎంతకీ పుస్తకాలేగాని వాస్తవప్రపంచముతో ప్రమేయం లేదండీ! అలాంటి మనిషి సలహా మనకెలా వుపకరిస్తుంది?"

"ఇంట్లో డెట్టాల్ చల్లుకుంటున్నాను గాని, వీధిలో మురికాలవ గురించి నేను తపనపడడం లేదు. మురికాలవ అలా వుంటూనే వుంటుంది."

"అవునం డవును,"

"బావుంది. 'డూడూ' బసవన్న లా," అంది గుణబాల.

"మీ నాన్నదగ్గిరికి కోయంబత్తూరు వెళ్ళకూడదూ?" అని సూచించాడు రామూ.

ఇక కోయంబత్తూరా? ఎవ రెవరు?

# 5

కోయంబత్తూరు గుణబాల ఒక్కర్తే ప్రయాణ మయింది. తను అలా రావడం యిబ్బంది హేతువా అని తండ్రికి ముందు జాబు రాసింది. రామ్మూర్తి — బాలకంటె తన కెవరూ లేరనీ, బాంకులోవున్న మూడు వేల చిల్లరా, రెండు వేల యిన్సూరెన్సూ ఆమెకోస మేననీ, ఆమెవాళ్ళు బాగుపడటం కంటె తనకు అన్య మేమీ లేదనీ, తప్పకుండా రావలసిందనీ

వెంటనే జాబు రాశాడు. ఆ లేఖ చూసుకుని బాల ఎంతో మురిసిపోయింది.

శ్యామలాంబ యీ ప్రయాణానికి వ్యతిరేకి. సత్రపు భోజనమూ మఠం నిద్రా చేస్తున్న రామ్మూర్తి పిల్ల సదుపాయాలు చూడలేడని ఆమె వాదన. గుణబాల వినలేదు. వెళ్ళడానికి నిశ్చయించుకుంది.

వెళ్తున్నప్పుడు సుభద్రమ్మ 'మాయింట్లో మణిపూసలా మసలుతున్నావ్. వొళ్ళు బాగు చేయించుకుని పిల్లనెత్తుకురా' అంటూ కంట తడిపెట్టింది.

రామామాత్రం గంభీరోపన్యాసం యిచ్చాడు. 'బాలా, నీ ఆత్మని ఎంతో సున్నితంగా వుంచుకో గలిగావు. కాని మనచుట్టూ వున్నది కిరాతమూక. పువ్వుల్ని నలిపెయ్యడమే వాళ్ళ జీవిత లక్ష్యం. ఏవ్యక్తినైనాసరే వాతావరణం కుంగదీస్తుంది. వెనక వోసారి అన్నాను—వీధిలో మురికాలవతో ప్రమేయం లేకుండా యింట్లో 'డెట్టాల్' చల్లుకుంటానని. ఆ పద్ధతికూడా కొంతవరకే సాధ్యమవుతుంది. మన యింటికి వెలుతురూ గాలీ రాకుండా ప్రహారీగోడ పెంచే పక్కింటాయన తన ఖజానాలో అమూల్యమైన వస్తువు లున్నాయని బాజాకొడ్తాడు. వాడు వొట్టి ఝూటాకోరు. వివేకశూన్యత మనచుట్టూ గజ్జెకట్టి నాట్యం చేస్తోంది. సాంప్రదాయమూ, ఆచారమూ జ్ఞానం ముందు సలాం చెయ్యాలి కనక, మనచుట్టూ బతికే మనుష్యులకి

జ్ఞానం అంటే భయం. మన యిల్లు పవిత్రంగా వుండేందుకు పీడిబాగుపడాలి. పీడి బాగుపడాలంటే పట్నం మొత్తంమీద బాగుపడాలి. పట్నమంతా బాగుపడాలంటే పట్నాన్ని పాలించే కర్తలు, వయసులోనూ డబ్బులోనూ కాక, బుద్ధిలో పెద్దవాళ్లై వుండాలి; అలా యీ సంబంధం పైకిపోతుంది. మనయిల్లు నేలమట్టం అయినా ఫరవాలేదు. ఆత్మమాత్రం చెక్కుచెదరకుండా వుండాలి.' ధోరణి సాగిపోతోంది......

"నువ్వు చెప్తూవుంటే వినడమే కాని నాకేమీ తెలీదు, రామూ."

"ఆ నిజాయితీకోసమే నిన్ను ప్రేమిస్తున్నాను, బాలా!"

ఈ ప్రియుడికి యియ్యగల బహుమానం ఏమిటా అని బాలకళ్ళు బాధతో రామూ మొహంలోకి చూశాయి. ఆ తెలీనిదానికోసం, ఆ అందని దానికోసం పలవరించే ఆవేదనే ప్రేమని నిత్యయవ్వనంలో వుంచుతోంది.

రైలుస్టేషన్ దగ్గిరికి రాఘవయ్యా, శ్యామలాంబా, వారి పిల్లలూ, రామూ, అప్పన్నా అందరూ వచ్చారు.

"అమ్మగారూ, మళ్ళా ఎప్పు డొస్తారండి?" అన్నాడు అప్పన్న.

వాడిచేతిలో ఒక రూపాయి కాయితం పెడుతూ, దానిమ్మ గింజలలాంటి పలువరస బయటపెట్టింది గుణబాల.

రైలెక్కిన తరవాత, బాల, వుత్తరాలు రాయమని అందరికీ వరసని చెప్పింది. బండిసాగింది. ఆడవాళ్ళ యింటర్

లోని ఆకుపచ్చ పుమాల్ని చూస్తూవున్న రాముడూ కనుకొలకులలోని నీరు యింకిపోవడం ఆ జనబాహుళ్యంలో ఏ ఒక్కరికీ చూడవలసిన పని లేకపోయింది.

అమ్మాయి బయలుదేరిందనే పెలిగ్రాం అందడంతోనే రామ్మూర్తి ఆదరాబాదరా యిల్లు వెతకడం మొదలుపెట్టాడు. ఎందుకంటే-యిన్నాళ్ళూ అతను రాజమ్మయింట్లో వుంటున్నాడు. రాజమ్మ ఎవరా? ఏ ఆశ్రయమూ లేక బికారి అయిపోయిన ఒక స్త్రీని చేరదీశాడు రామ్మూర్తి. ఆవిణ్ణి కనికరించి పోషించడం మొదలెట్టాడు. ఎలాగా పోషిస్తున్నానుగదా అని, అన్ని అవసరాలూ తీర్చుకుంటున్నాడు. ఈ సంగతి గుణబాలకి గానీ, మిగతా బంధువులకి గానీ తెలీదు. రాజమ్మకి మాత్రం రామ్మూర్తికి ఒక కూతురు వుందని తెలుసు.

"అంత ఆరాటమెందుకు? అమ్మాయిని యిక్కడికే తీసుకురండి. మీ అమ్మాయొకటీ నా బిడ్డొకటీనా?" అని సులువుగా అనేసింది రాజమ్మ.

రామ్మూర్తికి ఆ పద్ధతి నచ్చలేదు. ఎదిగిన కూతురు దృష్టిలో తను న్యూనత పొందడం అతనికి బావోలేదు.

"రెండు నెలలో, మూడు నెలలో వుంటుంది. ఈ నాలుగు రోజులూ గోప్యంగావుంటే తీరిపోతుంది. ఎందుకు అనవసరంగా యాగీ చేసుకోవడం?" అన్నాడు,—దూరదేశం పోయినా, కొత్తమనుషుల మధ్య బతకనేర్చినా, మర్యాద వాసనలు చావని రామ్మూర్తి.

పెళ్ళాం కాకా కనక, రాజమ్మ రామ్మూర్తి మాట చెప్పినా ఎదురాడేది కాదు. రామ్మూర్తి ఒక సందులో చిన్న యిల్లు కుదిర్చాడు. వంటమనిషిని మాట్లాడాడు. రాజమ్మ యింటిలో సామానే కొంత అక్కడికి చేర్పించాడు. అమ్మాయి రైలు దిగే వేళకి అంతా తయారుగా వుంచాడు.

అసలే కొరసంగా వున్న పిల్ల—అందులో అయిదారు వందలమైళ్ళ ప్రయాణం—కోయంబత్తూరు స్టేషన్‌లో దిగే టప్పటికి గుణబాల సగం చిక్కి శల్యమైవుంది. "ఎంత చిక్కిపోయావే!" అన్నాడు రామ్మూర్తి, మరచెంబు చేతిలో పుచ్చుకుంటూ.

మూడురోజులదాకా గుణబాలకి ప్రయాణబడలిక తగ్గ లేదు. నాలుగో రోజున రామ్మూర్తి అమ్మాయిని డాక్టర్ చేత పరీక్ష చేయించాడు. డాక్టర్ ఎక్స్‌రే ఫోటో తీశాడు. రక్తం పరీక్ష చేశాడు.

"కేసిప్పుడే ముదిరి పోతోంది, మీ రింత ఆలస్యం చేశారేం!" అన్నాడు డాక్టర్.

"ఆలస్య మేమిటి! మంగళవారం నాడు అమ్మాయి వచ్చింది. ఇవ్వాళ శనివారం" అన్నాడు రామ్మూర్తి.

"అమ్మాయికి పెళ్ళయిందా?"

"పెళ్ళయి దరిదాపు మూడేళ్ళవుతుంది."

"ఇప్పుడామె వయసెంత?"

"పదహేడు."

"ఆ పిల్లకి పదిహేడేళ్ళు! పద్నాలుగో ఏడు రాగానే ముడిపెట్టేశారన్న మాట. భలేవారండి!"

"తల్లి లేని పిల్ల బాబూ!"

"అత్తారింటికి మాత్రం రెండేళ్ళదాకా—మళ్ళీ నేను చెప్పేదాకా—పంపించకండి. కడుపు వచ్చిందా ఆశ నిరాశే!"

రామ్మూర్తి మందూ మాకూ కనుక్కుంటూ, చేతనయిన పరిచర్యలు చేస్తున్నాడు. ఎంతైనా కన్నకూతురు. వంటమనిషి గృహకృత్యమంతా నిర్వహిస్తోంది. రాజమ్మకి గుణబాలని చూడాలనీ, తనకూడా సాయపడాలనీ అభిలాషగా వుండేది. కాని, ఎలా?

రామ్మూర్తి పదిన్నరకి ఆఫీసుకుపోయి, సాయంత్రం అయిదు దాటినతర్వాత వచ్చేవాడు. గుణబాలకి పొద్దుపోయేది కాదు. డాక్టరు ఎక్కువగా చదవకూడదనీ ఆలోచించకూడదనీ నిర్దేశించాడు.

నెమ్మది నెమ్మదిగా యిరుగూ పొరుగూ ఎవరో వాకబు చేసింది గుణబాల. ఒకపక్క సబిన్స్పెక్టరు—రెండోపక్క సాయిబులు. ఎదురుగా అక్కడే స్థిరనివాస మేర్పరచుకున్న తెలుగు కోమట్లు. అరవయాసతో తెలుగు మాట్లాడేవాళ్ళని చూస్తే బాలకి తలనొప్పి. అంచేత కోమట్లని లిస్టులోనుంచి కొట్టేసింది. సాయిబులతో సరిపడదు. యిక మిగిలినది సబినస్పెక్టరు. ఆయన తెలుగు జిల్లాలలోవాడు. ఉద్యోగరీత్యా ఆవూళ్ళో వుంటున్నాడు. సబినస్పెక్టరుగారింట్లో ఆడ

పిల్లలెవరైనా వున్నారా అని దరియాప్తు చేసింది, తన వయసుపిల్లే ఒకతె వుంది స్కూలుఫైనలు పరీక్షకి వెళ్ళింది. యిప్పుడు సెలవలు. "అయినా చదువుకున్న వాళ్ళకి గర్వం. అందరూ రామాకిమల్లే వుంటారా, తనతో మాట్లాడతారా!" అనుకుంది.

రమాదేవి అలాంటిది కాదు. మెరుపులాటి పిల్ల — చద రంగం, పేక, కేరమ్సు, ఖబుర్లు—ఒకటేమిటి, గుణబాలకి వూపిరాడ నిచ్చేదికాదు. అనతికాలములో గుణబాల రమా దేవి హృదయాన్నాక్రమించుకుంది.

ఒకసాయింత్రం తెల్లటిచీర కట్టుకుని, మల్లెపూలదండ జడలో పెట్టుకుని, కుర్చీలో కూచుని ఏదో వుత్తరము చదువు కుంటోంది గుణబాల—రమాదేవి వెనకాలవచ్చి కళ్ళు మూసింది.

"దొంగా, నాకు తెలుసునోయ్!" అంది బాల.

"ఏమిటా వుత్తరము — అన్నిసార్లు చదువుతున్నావు!"

"రామూ రాశాడు."

"ఎవరూ?"

"రామూ!"

"భలేదానివే! భర్తా, ప్రియుడా..."

"అంత తెలిసిన రామూ నాలాంటి దానికోసం యిలా వ్యాకులపడతా డనుకోలేదు."

"అంత వెర్రి ఎత్తించావు కాబోలు!"

"అదికాదు, రమా!" అంటూ గుణబాల ఎన్నో కథలూ, గాథలూ, రామ్మూర్తి యింటికి వచ్చేదాకా చెప్పింది. రమాదేవి రెప్పవాల్చకుండా గుణబాల మొహం లోకి చూస్తూ, ఆమె చెప్పిన సంగతులన్నీ ఆకర్ణించింది.

మర్నాడు మధ్యాహ్నం రమాదేవి, మాటల సందర్భంలో, గుణబాలతో అంది. 'అంత చిన్నవయసులో పెళ్ళి చేసుకున్నావేం ?'

"నేను చేసుకోవడమేమిటి ?—చేశారు "

"మీ నాన్న చాలామంచివాడిలా కనిపిస్తాడే !"

"నాన్న మంచితనానికీ నా పెళ్ళికీ సంబంధం ఏమిటి ?"

"మరి ఎవరుచేశారు నీపెళ్ళి ?"

"సంఘం"

"తిరగబడాలి."

"తన యినపపాదాలకింద నలిపెయ్యదూ ?"

"నలిపోతే నేం—నికృష్టపు జీవితం సాగించడం కంటె!"

గుణబాలకి రమాదేవిని ఒక్కసారి ముద్దు పెట్టుకోవాలనిపించింది. ఆమె రెండు చెంపలూ మృదువుగా వాయించింది.

"సలహా చెప్పగలిగే నీలాటి స్నేహితులుకూడా లేక పోయారు, రమా. పుల్లమ్మత్త కూతురూ, వెంకుపిన్ని మరదలూ నా పెళ్ళికి పలవరించి పోయారు."

"మీ ఆయనమీద నీకిష్టం ఎలాకలిగింది ?"

"అదే ఆలోచిస్తున్నాను."

గుణబాల కోలుకుంటూ వచ్చి నెలా పదిహేను రోజు లయింది. డాక్టరు శ్రమ కొద్దిగా ఫలిస్తోంది. ఈలోగా భానుమూర్తి దగ్గర్నుంచి నూతన వృత్తాంతాలూ, రామూ దగ్గర్నుంచి ఆడు వృత్తాంతాలూ వచ్చాయి.

అన్నిటికీ సక్రమంగా జవాబులిస్తూ వచ్చింది. కాల క్షేపానికి లోటులేదు. అంతా హాయిగా గడచిపోతోంది.

# 6

ఇలా వుంటూ వుండగా...!

ఒకరోజు మధ్యాహ్నం రమాదేవీ, గుణబాలా, తమల పాకులు నములుతూ వుండగా, గుమ్మందగ్గిర సాక్షాత్క రించాడు రామూ. క్షణకాలం గుణబాల తన కళ్ళనే నమ్మ లేకపోయింది. అమాంతం ముందుకు దూకి అతని రెండు చేతులూ పట్టుకుని 'రామూ!' అంది.

నలగని సూటులోవున్న రామూని 'సామానేదీ?' అని ప్రశ్నించింది.

"హోటల్లో దిగాను."

"ఇల్లు కనుక్కో లేకపోతానని ?"

స్నేహితురాలి మొహంలోని సంబరానికి రమాదేవి ఆశ్చర్యపడింది. గుణబాల 'కాఫీ పెట్టు, అవ్వా!' అంటూ

వంటమనిషిని వుద్దేశించి అంది ఒకతే హడావిడి! రమ లోపల్లోపల నవ్వుకుంది.

గుణ కుశల ప్రశ్నలన్నీ వేసింది. అప్పన్న మొదలుకుని తనను ఆక్షేపించిన పొరుగింటావిడ వరకూ అందరి యోగ క్షేమాలు విచారించింది. ఈ సందడిలో—ఇప్పుడే వస్తానంటూ రమాదేవి తప్పుకుంది. కాఫీలు కాచియిచ్చి, సాయంత్రం తొందరగానే వస్తానంటూ, అవ్వ తన ఇంటికి పోయింది. ఇక్కడ ఈ ఇంటిలో యిద్దరే మిగిలారు.

"నీ వొంట్లో ఎలా వుంటోంది?"

"కాస్త తేలిగ్గానే వుంటోంది. ఎలా కనిపిస్తున్నాను?"

"కొద్దిగా నయమే!"

"భానుమూర్తిగారు రమ్మని రాస్తున్నారా?"

"ఇంకా లేదు—నాన్న అప్పుడే పంపడు."

"నాన్న ఎలా వుంటున్నాడు?"

"ఏం—బాగానే వుంటున్నాడు."

"ఇక్కడ కూచున్న అమ్మాయి స్నేహితురాలా? రమాదేవి అంటూ రాశావ్—ఈవిడేనా?"

"ఊఁ."

లోకాభిరామాయణం ఒక అరగంటగడిచిన తర్వాత మొదలెట్టాడు రాముా తన సొద

"నీతో చెప్పివెళ్దామనివచ్చాను, బాలా. నా జీవితంలో అల బనం అనుపించడంలేదు. నిరుత్సాహ పడుచుకున్న

పుస్తకంమీదకూడా మక్కువ సన్నగిలుతోంది. నా ప్రేమకి ప్రతిఫలం దొరకదు. సాధారణ విషయాలుచూస్తే చికాకు పుడుతోంది. ఈ ప్రపంచం నాకు నచ్చటంలేదు. మరో ప్రపంచంలోకి పోతాను.''

''ఎక్కడుంది అది ?''

''రణరంగంలో. తిండీ బట్టాలేనివాళ్లూ, తప్పనిసరి అయినవాళ్లూ మాత్రమే యీ దేశమునుండి యుద్ధంలోకి వెళ్తున్నారని నాకు తెలుసు. ఈ యుద్ధంలోని జయాపజయాలపట్ల అపేక్షవల్లగానీ, రాజకీయ సూత్రాలమీద వుండే విశ్వాసంవల్ల కానీ, నేను వెళ్దామనుకోవడంలేదు. భారతజాతికి యీ యుద్ధంతో ప్రసక్తిలేదు—అన్న పెద్దల వాక్యం మీద గురిలేకపోలేదు. చైతన్య రహితమైన జన సమూహంలో బతకలేకుండావున్నాను. నాముందూ వెనకా అంధులూ, పాషండులూను. పాతవీరుల రక్తం నన్ను సాహసకృత్యాలకి పురికొల్పుతోంది. నా జీవితంలో ప్రళయ తాండవంరావాలి, బ్రహ్మాండమైన మార్పు కావాలి !''

''మామ్మవిషయం ఆలోచించావా ?''

''పూజామందిరంలోని సీతారాములే ఆమెకు శాంతి నివ్వాలి''

''ఎందుకీ నిస్పృహ రామూ ?''

''ఏ ఆశతో జీవించమంటావు, బాలా ?''

''ఆశలేవీ కనిపించడం లేదుకనుక యుద్ధంలోకి పారిపోతావా ?''

"అది యుద్ధం కాదు — యింతకంటె విశాలమైన జీవితం!"

"నువ్వు క్షతగాత్రుడివైతే నీ భావిజీవితం?"

"అవును. నేను అమరజీవిని. మరణానికి భయపడను కాబట్టే అది నాకుదూరంగా నుంచుంటుంది."

"నీధయిర్యమూ, మాటలుచూస్తే..." అంటూ గుణబాల రామూవొళ్ళోకి వురికి, అతని పెదిమలూ నుదురూ ముద్దుపెట్టుకుంది."

"రామూ, నన్ను విడిచేస్తావా?"

"ఈ సాంఘిక బంధనాలు తెంచుకు నువ్వు నాదగ్గిరికి రాగలవా? రాలేవు, బాలా, నాకు తెలుసు. రాలేవు, రానివ్వరు—నీ రెక్కలు విరగ్గొట్టి మూలపడేస్తారు."

"వాళ్ళకి అందుతానా, రామూ!"

రమాదేవికి—యింటి తాళాలు అవ్వకి అందచెయ్యమని యిచ్చి, ఇద్దరూ హోటలుకి బయలుదేరారు. గుణబాల కోయంబత్తూరు వచ్చిన తర్వాత తనుచూసిన వీధులూ, సినిమాలూ, సంగతులూ ఒక్కటొక్కటే—మధ్య మధ్య చమత్కారాలతో రామూకి చెప్పింది. ఇద్దరూ హోటలు గదిలో కూచున్నారు.

"సామాను యింటికి తీసుకుపోదాం" అంది గుణబాల

"అలాగే—కాసేపుకూచో."

కాసేపు కాదు—చీకటిపడేదాకా కబుర్లు చెప్పుకుంటూ కూచున్నారు. కాలగమనాన్ని యిద్దరూ మరిచారు. వీధిలో మల్లెపూలవాడి కేక, కాఫీ కప్పులరొద చీల్చుకుని విని పించింది.

రాముా మల్లెపూలదండ తీసుకొచ్చి గుణబాల జడలో పెడుతున్నాడు. బాల అతని రెండు చేతులూ తన చేతుల్లోకి తీసుకుని రాముా ఒళ్ళోకి జారిపోయింది. అతని మొహం వయిపు దీనంగా చూస్తూ అంది "రాముా! నన్ను ఒదిలి వెళ్ళిపోతావా?"

"ఏం చెయ్యను?"

"ఎప్పుడూయిలాగే వుండిపోదాం"

"ఎప్పుడూ యిలాగే యీ హోటల్లోనే, ఈ నల్లుల మంచంమీదే, తిండీ తిప్పలూ లేకుండా—"

"అల్లరి రాముా!"

"ఇంక, నా దేహం స్వాధీనం తప్పుతోంది."

"తప్పనీ, నేనే అడుగుదామనుకుంటున్నా."

లైటారిపోయింది; మల్లెపూలు నలిగిపోయాయి.

ఇల్లు చేరుకునేటప్పటికి తొమ్మిదింపావు అయింది. రామ్మూర్తి వీధిగడపమీద కూచుని వీరికోసం ఎదురు చూస్తున్నాడు. జట్కా యింటిముందు ఆగగానే, "రా... నాయనా వచ్చావా? తిన్నగా యిక్కడికే రాక ఆ హోటల్లో ఎందుకూ? మనవాళ్ళంతా క్షేమంగా వున్నారా?

ఏదో కడుపుకూటికి దూరదేశానికి వచ్చేశాను. మా వొదిన గారి పిల్లలు ఖులాసాగా వున్నారా? మీ నాన్నగారీ మధ్య కాలం చేశారటగా! బహుయోగ్యుడు. నీకేమోయ్! మహారాజువి. దిట్టంగా సంపాయించి పోయూడు. మీ అమ్మ గారు బావున్నారా? మనవాడనగానే ప్రాణం లేచివచ్చి నట్టుంది...బియ్యానికి అక్కడా యిలాగేవుందా? నీకేం-పంట ధాన్యం వస్తుంది." ఇదీ రామ్మూర్తి ధోరణి.

రామూ గుణబాల యింటిలో వారంరోజులు మకాం వేశాడు. ఏనాటి కానాడు ప్రయాణం-మర్నాటికి వాయిదా. గుణబాల డాక్టర్ ఆజ్ఞలు వుల్లంఘించి, ఆ వారంరోజులూ చెయ్యకూడని పనులన్నీ చేసింది.

రాజమ్మ తను రామ్మూర్తి మొకటిపెళ్లాం పరిచయస్తు రాలినంటూ ఒక మధ్యాహ్నం వచ్చింది. గుణబాల తల్లి ఎలావుండేదో గుణబాలకీ తెలీదు, రాజమ్మకీ తెలీదు. ఇద్దరూ ఒక అరగంట చచ్చిన ప్రాణిని తలచుకుంటూ అర్థం లేని మాటలు చెప్పుకున్నారు.

ఆ మర్నాడు రామ్మూర్తితో అంది రాజమ్మ, "ఆ రామూ అంటే మీ అమ్మాయికి చాలా ఆపేక్షఅండీ!"

"అయితే కావచ్చు."

"మొగుడికి తెలిస్తే?"

"ఏముంది తెలిసేందుకు?"

"ఇద్దరూ చిన్నవాళ్ళు......"

"ఛా, యీకాలపు మనుషులసంగతి నీకు తెలీదు. ఆ రమాదేవి లెక్చర్ మొదలుపెట్టిందంటే మొగాళ్ళే పారిపోతారు. మన గుణబాల నిప్పులాంటిపిల్ల."

మొట్టమొదట, భానుమూర్తికి అమ్మాయి సౌశీల్యంతో ప్రసక్తిలేదు. చీటికి మాటికీ శాసించి బుద్ధులు నేర్పలేరని అతనికి తెలుసు. అదీకాక, అతనికి కావలసింది ఆమె ఆరోగ్యం. ఎవరిచేతలకి వారే బాధ్యులుగా! మధ్యని తన కెందుకు?

రామూ రేపు వెళ్తాడనగా గుణబాల అతనిదగ్గిర హామీ పుచ్చుకుంది—అతను యుద్ధంలోకి వెళ్ళకూడదని.

"నా వొంట్లో స్వస్తత చిక్కినతర్వాత నీ దగ్గిరకే వచ్చేస్తాను."

"భానుమూర్తి కన్నీళ్ళు నిన్ను ఆపేస్తాయేమో!"

"అవి నా పైటచెంగుతో తుడిచి, నీదగ్గరికి వస్తాను."

"నువ్వు వస్తావనే సంతోషమేకాని—నువ్వు రాగలవనే విశ్వాసం నాకు కలగడంలేదు."

"ఏంచేస్తే కలుగుతుంది?" అంది గుణబాల.

"ఏం చెయ్యనక్కర్లేదు. నమ్ముతున్నాను" అన్నాడు రామూ ఆమె తల నిమురుతూ.

రామూ వెళ్ళిపోయాడు. వీలైతే మరో రెండు నెలలు పోయిన తరువాత వస్తానన్నాడు. రమాదేవితో గుణబాల తను రామూకిచేసిన వాగ్దానం చెప్పింది.

"ఇంత ఆర్భాటం ఎందుకు యీ విషయానికి ? నీకు భానుమూర్తి మీద యిష్టం లేదు. రామూతో వుంటావు. ఏముంది దీనిలో ?" అంది, ప్రేమ అంటే పుస్తకరూపంగానే కాని, అనుభవరీత్యా తెలీని రమాదేవి.

"భానుమూర్తిగారిమీద నాకిష్టం లేక కాదు; నా కాయన్ని తలచుకున్నా జాలేస్తుంది."

"అది అసంభవం. నువ్వు రామూని మనసారా ప్రేమించావు. లేతకు డెవి నీ భర్త స్వాధీనం చేసుకున్నాడు."

"అయితే నా కాయనమీద జాలెందుకు ?"

"ఆ జాలి నీమీదే—ఆయనమీద కాదు. సాంఘిక గౌరవంమీదా, మర్యాదమీదా మమకారం."

"విషమ సమస్యలో పడ్డాను, రమా."

"విషమా లేదు; సమస్యా లేదు. ముందు ఆరోగ్యం చూసుకో."

ఆరోగ్యమే చూసుకుంటోంది. కాని......

## 7

భానుమూర్తి పిడుగులా వచ్చిపడ్డాడు. రామూ కోయంబత్తూరు వెళ్ళి గుణబాలతో వారంరోజులు గడిపి వచ్చాడన్న సంగతి ఎవరో మోసేసి పుణ్యం కట్టుకున్నారు. కోయంబత్తూరు కాఫీతోటల్లో షేర్లు కొనడానికి రామూ వెళ్ళి

వుంటాడని సమాధాన పరుచుకో చూశాడు భానుమూర్తి. కాని—మొండిమనసు—వినదే! తనుపట్టిన కుందేలుకి మూడే కాళ్ళంది.

మందులనే వంకతో తండ్రిదగ్గర వుంటున్న గుణబాల ప్రవర్తన భానుమూర్తికి నచ్చలేదు. గుణ తనకి అపచారం చేస్తోందనీ, తను యిచ్చిన స్వాతంత్ర్యానికీ చనువుకీ తనను మోసం చేస్తోందనీ తలపోశాడు. యీ దొంగచాటు వ్యవహారం ఎందుకు? తనతో కాపరం యిష్టంలేదని స్పష్టంగా చెప్పెయ్యకూడదూ? తను యింకోపిల్లని చూసుకుంటాడు. నెలకి వందరూపాయలు సంపాయిస్తున్న తనకి నెత్తిన పెట్టుకు యిస్తారుపిల్లని.

భానుమూర్తి మధ్యాహ్నం పన్నెండు గంటలవేళ సావిట్లో అడుగు పెట్టాడు. రమాదేవి ఎవరో స్నేహితుల యింటికి వెళ్ళింది. అవ్వ పని పూర్తి చేసుకు యింటికి వెళ్ళింది. గుణబాల ఒక్కర్తే వుంది. భానుమూర్తిని చూసి విస్తుపోయింది. తను ఏమంటున్నదీ ఆలోచన లేకుండానే, 'ఇలా వచ్చారేం!' అంది.

"రాకూడదా?"

"అప్పటికి తెలివి వచ్చింది బాలకి. తన తొందరపాటుని సవరించుకుంటూ 'చోద్యంగా మాట్లాడుతారు—అదికాదు. కార్డుముక్కొకటి రాసిపారేస్తే స్టేషనుకి వచ్చేదాన్నిగా,' అని సర్దుకుంది.

"ఆ, నిన్ను శ్రమపెట్టడ మెందుకనీ, ఏవో మందు పుచ్చుకుంటున్నావుగదా నీకు ఇబ్బంది కలిగించడ మెందుకనీ రాయలేదు."

"తిన్నగా హైదరాబాద్ నుంచేనా?"

"ఆఁ"

సాయంత్రం రమాదేవి గుణబాలని అడిగింది, 'ఎందుకొచ్చినట్లీయన?'

"ఏమోనమ్మా—నాకూ తెలీడం లేదు."

"నిన్ను తనవెంట తీసుకువెళ్దామని వచ్చి వుంటాడు."

"ఆ, మందు పుచ్చుకుంటున్నదానిని నన్నెందుకు తీసుకువెళ్తారు?"

"ఆయనకు భోజనం సరిగా అమరడం లేదేమో?"

"అయితే?"

"అయితే లేదు; గియితే లేదు. పడపడ వుంటాడు రేపు. నాకు తెలుసోయ్ యీ మొగాళ్ళంతా ఒకటే!"

"కాదు, రమా—ఆయన బాగా చదువుకున్నారు."

"ఈ నడమంత్రపు చదువులు చదువుకున్న వాళ్ళకంటె చాకలివాళ్ళు మేలు. స్త్రీ స్వాతంత్ర్యం గురించిన అభిప్రాయాలు పొరుగింటి అమ్మాయిల గురించి—పెళ్ళాం కోసం కాదు. పెళ్ళాన్ని ఆవకాయజాడీలో భద్రం చేసుకుంటూ వుండవలసిందే!"

"మరి నువ్వు పెళ్ళిచేసుకోవూ?"

"మా అక్క చేసుకుని అనుభవిస్తోందిగా—నాకూ కూడా ఎందుకూ?"

భానుమూర్తి రావడంతో వాళ్ళ సంభాషణ అక్కడికి తునిగిపోయింది. అతని వెనకాలే రామ్మూర్తి కూడా వచ్చాడు. అల్లుడి యింక్రిమెంటు, భోజనవిషయం, హైదరాబాద్ మతకలహాలూ, యుద్ధానంతర యిండియాలో వుద్యోగాల విషయం—యిత్యాది లోకవార్తలు మామా అల్లుళ్ళు పదినిమిషాలపాటు మాట్లాడారు.

"డాక్టరుగారు చాలా శ్రద్ధగా మందిస్తున్నారు. ఇంకో రెండు నెలల్లో పూర్తిగా నయమవొచ్చనంటున్నారు... చిన్నపిల్లా యేమున్నా! అదే చెప్తుంది నాయనా నీకు సమస్తం...మా ఆఫీసువాళ్ళు వార్‌ఫండ్ నాటకాల టిక్కెట్లు అంటగట్టారు. అలా పోయివస్తాను," అంటూ రామ్మూర్తి, కూతురుకీ, అల్లుడికీ సావకాశంయిస్తూ, తను వీధిలోకి తప్పుకున్నాడు.

ఇద్దరికీ చెరో మంచం వేసి తెల్లటి దుప్పట్లు పరిచింది గుణబాల. తన మంచంమీద తను వొత్తిగిల్లింది. కిటికీలోనుంచి చంద్రకిరణాలు ఆమె చెక్కిళ్ళ మీద పడుతున్నాయి. పక్కింట్లో రమాదేవి కమ్మటిపాట అందుకుంది. ఆపాటతో బాటు నైట్‌క్వీన్ వాసనని గుణబాలవైపుగా తోలుతోంది రమ. ఆ వెన్నెట్లో రమ దగ్గిర కూచుని ఏవో పిచ్చికబుర్లు చెప్పుకోవాలనిపించింది గుణబాలకి. ఎలా? పక్కనిభర్త.

తన సమస్తాన్నీ మంగళసూత్రంతో కొనుక్కున్న యోధుడు.

రమాదేవిపాట ఆగిపోయిన తరువాత కథానాయకుడు వుపక్రమించాడు.

"గుణబాలా! నిన్ను తీసుకువెళ్ళిపోవడానికి వచ్చాను."

తనను 'గుణ' అనేగాని 'గుణబాలా' అని ఎప్పుడూ సంబోధించడు. రమాదేవి పలుకులు స్ఫురణకి రాసాగాయి గుణబాలకి.

"నీ నడత బావోలేదు. నీ స్వభావం యింత నీచమైందని అనుకోలేకపోయాను. తుదినిర్ణయం చేసుకోడానికి పూర్వం నిన్నోసారి చూసిపోదామని వచ్చాను."

గుణబాలగుండె దడదడ కొట్టుకుంది. ఈ మాదిరి భాను మూర్తిని ఆవిడ ఎరగదు.

"మీ రనేమాటలు నాకు తెలీడంలేదు."

"నేను మరోపెళ్ళి చేసుకుంటాను."

"ఓస్! యింతేనా, ఏమిటో అనుకున్నాను. జబ్బు మనిషిని యింత ఖంగారు పెట్టవచ్చా, చెప్పండి? పెళ్ళెప్పుడు—పిల్లెవరు?"

నువ్వన్నిటికీ తెగించావులే. మతిలేక ఇక్కడికి వచ్చాను. జబ్బట, నేను రాగానే జబ్బువచ్చింది. ఆ రామూ వచ్చి నప్పుడో..."

తారా జువ్వలా లేచింది గుణబాల. శపించబోయే ముని బాలికలావుంది ఆమెతీరు.

ఉద్వేగంలో ఆమె కళ్ళు చీకటిని చీల్చబోతున్నాయి. కాని, కళ్ళు తమంత తాము చూడలేవు. బయటనుంచి వెలుగు సాయం తెచ్చుకోవాలి.

"మీా రేమంటున్నారు ?" అంది గుణబాల.

"ఏమిటా ధీమా ?"

"రామూ ప్రస్తావన నాదగ్గిర ఎత్తకండి."

భానుమూర్తి తెలివితక్కువ భర్త కాడు. ఆమె కళ్ళ నీళ్ళు బొటబొట రాలేటట్లు చేసేందుకు ఉద్యుక్తుడై వున్నాడు. ముందు తన అధికారాన్ని పురస్కరించుకుని వాడావిడి సాగించాడు.

"నువ్వు నీ నడత మార్చుకోవాలి."

"ఏం నడత ?"

"నీ వెఱ్ఱిపోకిళ్లు."

"మీా అనుమానాలన్నీ నా నెత్తిన రుద్దుతున్నారు."

"అవున్లే. నా దేపొరపాటు. కులమూ సాంప్రదాయమూ లెక్కచేయకుండా తల్లి లేని పిల్లవి గదా అని దయదలచి చేసుకున్నందుకు శాస్తి."

"ఉద్ధరించారు. మీారు చేసుకోకపోతే నాకు మొగుడే దొరక్కపోయేవాడా ? పెళ్ళి కాకపోతే బతికి పోదును... యివేం మాటలు మతీశ్రుతీ లేకుండా !"

"నీ మొహం చూడకూడదు గుణా ! నువ్వు మైలపడి పోయావ్ !"

"నాకుమైలా !"

"రామూ నీకేదో కనకాభిషేకం కట్టి పెడతాడను కుంటున్నావు. తుమ్మెదకి పువ్వెంతో రామూకి నువ్వంత."

"రామూ ప్రస్తావన తీసుకురావద్దని మీతో చెప్ప లేదూ?"

"చెప్పారమ్మా చెప్పారు...ఎంత తెగించావు, గుణ బాలా ! నేను నిన్ను వదిలేస్తాను."

"ఆ విషయం చెప్పేందుకు కోయంబత్తూరు వచ్చారా ? కార్డుమీదరాస్తే పోయేదిగా !"

"అనాథ అంటే యేమిటో నీకు తెలియడంలేదు. నేను వదిలేసిన మర్నాడు నీ బతుకంతా నేల మట్టమైపోతుంది."

"ఈ పిచ్చివాగుడుతో మీ మీద నాకున్న అభిమానా న్నంతా పోగొట్టుకుంటున్నారు."

"ఒకప్పుడుండి ఏడ్చినట్లు !"

"పోన్లెండి—లేదు. నన్ను వేధించక, శుభ్రంగా నిద్ర పొండి."

ఆరాత్రి భానుమూర్తి గుణబాలని కోరాడు. ఆరోగ్య కారణం చెప్తూ ఆమె నిరాకరించింది. ఇద్దరూ చెటపట లాడుకున్నారు. తెల్లారేటప్పటికి ఎడమొహం-పెడమొహం.

ఇలా ఒదిలేసివెళ్తే మొదటికే మోసం వస్తుందను కున్నాడు భానుమూర్తి. గుణబాల లేచిపోతే 'ఫలానాయన పెళ్ళాం' అంటారు. అంత ప్రేమించిన పెళ్ళాం యిలా నట్టేట్లో

ముంచుతుందనుకోలేదు. సావధానంగా సమస్యా పరిష్కా-
రానికి పూనుకున్నాడు.

"మీ నాన్న రాజమ్మని వుంచుకున్నాడుటగా!"

"నాకు తెలీదు."

మీ రంతా ఒక లేమచ్చు."

భానుమూర్తి పెళ్ళాన్ని జాగర్త పడుచుకునే ప్రయ
త్నంలో పతితుడై పోయాడు. ఆమెను స్వాధీనపరచుకుంటేనే
గాని నిద్రపట్టడంలేదు. కష్టనిష్ఠూరాలకి వోర్చి అయినా
సరే, ఆమెని హైదరాబాద్ తీసుకు పోదామనుకున్నాడు.
ఇక్కడుంటే తండ్రి ఆనరాచూసుకు తన్ని ఎదిరిస్తోంది.
అక్కడ దీని మొహం చూసే దిక్కేదీ?

వచ్చిన అయిదోరోజు మధ్యాహ్నం భానుమూర్తి గుణ
బాలతో మర్నాడు బయలుదేరదా మన్నాడు. బాల తను
రానంది. ఆటలు సాగవన్నాడు. మాటలు కట్టిపెట్టమంది.

"నా వొంట్లో సుఖువు చిక్కిన తరవాత నేను రాక
ఎక్కడికి పోతాను! ఇంకో రెండు నెలలపాటు వూరుకోండి."

"ఈ లోపుగా రామూతో కలసి కాశ్మీరం పారిపోతే!
ఎంత అప్రతిష్ట!" అనుకున్నాడు భర్త.

ఆ వేళ ఆదివారం. రామ్మూర్తి కూడా యింట్లోనే
వున్నాడు. తన అభిప్రాయం చెప్పాడు రామ్మూర్తితో
అల్లుడు.

"ఇంకో రెండు నెలలు వూరుకో, నాయనా!"

"వూరుకోనండి. నా పెళ్ళాం మంచి చెడ్డలూ క్షేమ లాభాలూ నాకు తెలుసు. యీ నీతీజాతీలేని పాడు కొంపలో ఆమె వుండడం నాకిష్టం లేదు."

రామ్మూర్తి తెల్లబోయాడు. అమ్మాయికోసం మల్లె పూలు దండగా కడుతున్న రాజమ్మ ముక్కుమీద వేలు వేసుకుంది.

పక్కింటి సాయిబూ, ఎదురింటి కోమటీ తనకిసాయం రాక పోతారా అన్నట్లు ఘట్టిగా అరుస్తున్నాడు భాను మూర్తి. 'ఇవ్వాళ నాతో వస్తే నే మీ అమ్మాయిని ఏల్తాను. లేకపోతే ఎవరి దారివారిదే! మందట! వెధవనాటకం. ఆ రామూకోసం యిక్కడపడి ఛస్తోంది."

రాజమ్మా, రామ్మూర్తీ ఒకళ్ళ నొకళ్ళు చూచు కున్నారు. గుణబాల తల వంచేసింది.

"వస్తాను పదండి," అంది గుణబాల.

రమాదేవి బాలని దొడ్లోకి లాక్కుపోయి చెప్పింది. 'వెళ్ళకు బాలా, వెళ్ళకు. నువ్వు ఎవరిని నమ్మలేకపోయినా నన్ను నమ్ము—నర్సుగా చేరి నిన్ను పోషిస్తాను. వెళ్ళకు ఆ నీచుడితో చెడిపోకు.'

"సత్తువరావడం లేదు, రమా!"

"నే నిస్తాను, బాలా! పశువుని తోలుకుపోయినట్టు, నిన్ను తీసుకుపోదామను కుంటున్నాడు. చూడు రామూకీ యితనికీ ఎంత తేడా వుందో! అధికారానికీ ప్రేమకీ మధ్య ఎంతవార!... అన్నిటిసీ మించినది సీ ఆరోగ్యం."

"నాన్న వుండమనందే ఎలావుంటావె ?"

రమాదేవి యింక మాట్లాడలేక పోయింది. ఛీ! ఆడదానిక్కూడా ఒక ఆత్మా ఆలోచనా వుంటాయని అనుకోలేని యీ మనుషులు ఎలా బాగుపడుతారు ?

ఆ రాత్రి రాజమ్మా రామ్మూర్తీ అమ్మాయికోసం చాలాసేపు పలవరించారు

## 8

హైదరాబాదు చేరాక మొగుడూ పెళ్ళాం. ఆ మర్నాటి రాత్రి భానుమూర్తి పెళ్ళాంతో అన్నాడు. 'గుణా, నిన్ను అనవసరంగా బలిపెట్టామని నా తలంపు కాదు. నువ్వు బాగుండటంకంటె అన్యమేమి కావాలి నాకు ? నువ్వు నన్ను వదిలేస్తావేమో అను భయంకొద్దీ మీ నాన్నముందు అంత మొరటుగా ప్రవర్తించాను. నువ్వు కాకపోతే నాకు దిక్కెవ్వరు ! నువ్వు లేకపోతే ఎవరికోసం బతికేది ?'

గుణబాల గుండె కొద్దిగా చలించింది. కాని, అతని క్రూరత్వాన్ని మాత్రం క్షమించలేకపోయింది. హైదరాబాద్‌లో గుణబాలకి రమాదేవిలాంటి స్నేహితులు దొరకరు. స్త్రీలకి వీథుల లోకి రావడమే భయమైన ప్రదేశంలో రమాదేవులు, ఎలా తయారవుతారు ?

గుణబాల హైదరాబాద్ వచ్చి వారంరోజు లైన తర్వాత, రామూకీ శ్యామలాంబకీ ఉత్తరాలు రాశింది. మాట నిలబెట్టుకో లేకపోయినందుకు తనని క్షమించి మరచి పొమ్మనీ, యుద్ధం ఆఖరు అయిపోయే రోజులు వచ్చాయి కనక యుద్ధంలో చేరడం గురించిన తలపు తుడిచివేసుకో మనీ, చిత్ర విచిత్రాలతో అతని ముందు ప్రదర్శిత మవుతూ వున్న కళామయ జీవితాన్ని సత్తువలేని తనలాంటి ఒక సామాన్యజీవికోసం త్యజించనక్కర లేదనీ — యింకా ఏమేమో రాసింది రామూకి.

రామూ చితికిపోయాడు. అతని జీవిత కలశంలోని మధువుని ఒక మూఢ ఆచారం కాలదన్నింది. జోర్లగిలపడిన రసపాత్రని చూస్తూ వాపోతున్నాడు రామూ.

"అత్తా, బాల యిలాచేసిం దేమి ?" అన్నాడు శ్యామలాంబతో.

"ఏంచేసింది నాయనా ? పండులాంటి కాపరాన్ని పాడు చేసుకుంటుందా ?"

"డాక్టరు మాట వినకుండానా... ఆరోగ్యం ?"

శ్యామలాంబ మాట్లాడ లేకపోయింది.

"భానుమూర్తి యింత మూర్ఖు డనుకో లేదు"

"మొగుడంటే ఏమిటనుకున్నావ్, రామూ. ఆ కష్ట నిష్ఠూరాలు ఆడప్రాణానికే తెలుస్తాయి."

"నాకు హైదరాబాద్ పోయి భానుమూర్తితో మాట్లాడా లని వుంది. ఎంత మొగుడైతే మాత్రం యిలాంటి మూర్ఖ రతా? యింకో నాలుగు నెలలు ఆవిణ్ణి కోయంబత్తూరులో వుండనిస్తే ఏం మునిగి పోయింది? అత్తా, భానుమూర్తితో ఆఖరికి మాట్లాడుతాను. అజ్ఞానమనే క్రతువుకి బాలని యజ్ఞపశువు కానివ్వను."

"వోర్చుకష్టు. బాల మీద నీకు నిజంగా ప్రేమ వుంటే నేను చెప్పినట్టు చెయ్యి. యిప్పుడువున్న స్థితిలోనే దాన్ని వుండనీ. కదపకు. మగతామాటలు కలకాలం వుండవు. ఏడాదో రెండేళ్ళో గడిచిన తరువాత మీ యిద్దరూ కలుసుకోలేక పోరు."

"అత్తా, నీకూ అర్థంకావడంలేదు నా బాధ."

"అలాగే అనుకుంటారు నాయనా మొగవాళ్ళు."

సంభాషణ తునిగి పోలేదు కాని పర్యవసానం ఏమీలేదు. రామూ వారంరోజులు, పదిరోజులు, పదిహేనురోజులు, నెల్లాళ్ళు ఆలోచించాడు. పువ్వుల్నీ, మబ్బుల్నీ, నక్షత్రాల్నీ బాలేదని అడిగేవాడు. పువ్వులు సౌరభాల్నీ, మబ్బులు ఆలోచనల్నీ, నక్షత్రాలు దిగులునీ యిచ్చేవి. ఒక సంధ్యా రాగంలో విశాలమైన మైదానంమీద కూచుని, పడమటి దిక్కుగా ప్రసరించిన రక్తారుణిమ పరీక్షిస్తూ వుండగా, బోధి చెట్టుకింద కూచున్న బుద్ధుడికి అమాంతం శాంతి కలిగి నట్టుగా రామూ మనసు తేలిక అయింది. 'బాల ఎవరు?

ఒక స్త్రీ. ఆశారూపిణి. ఆమె తగిలీ తగలని చేలాంచలం కోసం ఎందు కీ వెఱ్ఱిపరుగు ? గుండెల్లోని దావానలాన్ని ఆజ్యంతో అభిషేకం చెయ్యడ మెందుకు ?"

"బాబూ, మాకు తలదాచుకునే చోటూ, నా అనేదీ లేవు. మా బతుకులు దయాధర్మ భిక్షంమీద నిలుస్తాయి. మీకు తోచిన దానం చెయ్యండి బాబూ!" యిరవైల్లోవున్న ఒకమ్మాయి తన నిర్లిప్తదీక్షకి జంకకుండా, చంకలో పాపనీ వెనక కుర్రాణ్ణీ వేసుకుని అర్థిస్తోంది. బర్మానుంచి వచ్చిన నిర్భాగ్యులలో ఆమె ఒకతె. పర్సులో నుంచి ఒక రూపాయి నోటు తీసి ఆమె కిచ్చాడు. అస్సాం అడవుల్లో ఆమెజీవితం విలువల నాశనాన్ని ఎంత నగ్నంగా చూసిందో కదా !

తనచుట్టూ ఎంత అసహాయత, ఎంత ఆక్రందన ! తను ఏం చెయ్యగలుగుతాడు ? యిండియా ఏం చెయ్యగలుతోం దీ యుద్ధంలో !

గుణబాలని మొదటి వారంలోనే డాక్టరుకి చూపించాడు భానుమూర్తి. యింజక్షన్లూ మందులూ మామూలుగా సాగుతున్నాయి. అంతా యథాప్రకారంగా జరుగుతూ వుంది.

ఎదురింట్లో వుండేవాళ్ళు ప్రతిరోజూ మధ్యాహ్నం, మొగుళ్ళు ఆఫీసులకి వెళ్ళిపోయిన తరువాత, రామభజన చేస్తూ వుండేవారు. దేవతారాధన అంటే చిన్నప్పట్నుంచీ గుణబాల బుర్రలోకి ఎక్కేది కాదు. ఏదో వూసుపోక,

తమాషా చూసేందుకు వెళ్తున్నట్టుగా వెళ్ళి, భక్తురాలై పూరుకుంది బాల.

భానుమూర్తి యింట్లో క్రిష్ణవిగ్రహం తయారైంది. యీ యింట్లో కూడా పూజలూ, జపాలూ, తపాలూ, భజనలూ, తయారయాయి. భానుమూర్తి తన పెళ్ళాం ఆదర్శ హిందూ స్త్రీ రత్నమై, ఆర్య సాంప్రదాయాన్ని నిలబెడుతున్నందుకు అమందానంద కందళిత హృదయారవిందుడయాడు. అతని సంతోషాన్ని అలాంటి సమాసంలోనే చెప్పాలి.

మడీ, ఆచారం, పీతాంబర ధారణ — యిలాంటివన్నీ యింట్లో ప్రవేశించాయి. తెల్లవారుజామున పాడే మేల్కొలుపులూ, పట్టుబట్ట కట్టుకోవడం, బాలమ్మ వుపోషాలూ భానుమూర్తికి నచ్చకపోయినా సహించక తప్పింది కాదు.

గుణబాలకి భక్తి కుదిరినప్పట్నుంచీ మొగుణ్ణి సిరాకరించడం పూర్తిగా మానుకుంది. పతి పాదసేవ—ఆ పైన కృష్ణచరణధ్యానమూ, ఆ రెంటికీ తన జీవితాన్ని కైంకర్యం చేసింది. మెట్టవేదాంతుల బూజుమాటలు బాల లేత బుర్రలో కోటలు కట్టుకున్నాయి. భగవంతుడిలో అయిక్యమవాలనేది. ఏమిటో యీ భక్తివాసనల అంతం?

"ఎంత భక్తమ్మా బాలమ్మగారికి" అని యిరుగమ్మా పొరుగమ్మా మెచ్చుకునేవారు. దవడలు నొక్కుకోవలసిన వాళ్ళు పొగడ్తలందిస్తున్నారు—యింకా ఏముంది గుణబాల!

"మీరు వుపోషాలు మానుకోవాలి. కోడిగుడ్లు తినాలి. పత్యం సరిగ్గా చెయ్యకపోతే జబ్బు కుదరదు. ఆపైన ఫలానా డాక్టరు...అంటారు" అన్నాడు డాక్టరు బాలతో.

"ఈ రీతిగా అయితే ఆవిడ కోలుకోదు. ఏదైనా నర్సింగ్ హోమ్‌లో చేరిపించండి. లేదా, మదనపల్లి తీసుకువెళ్ళండి. పత్యం సరిగ్గా జరగడంలేదు. ఆవిడకి వంటా సంసారం పనికి రావు. ప్రమాదాన్ని నివారించే వుపాయం వెతక్క మీరు నిద్రపోతున్నారు" అని కూకలేశాడు భానుమూర్తిని డాక్టరు.

ఆ సాయింత్రం భానుమూర్తి పెళ్ళాంతో అన్నాడు! "ఇవ్వాళ డాక్టర్ ఏమన్నాడో తెలుసా ?"

"ఈ డాక్టర్లకి ఏం తెలుసండీ! ఆ భగవంతుడి ఆజ్ఞ ఎప్పుడైతే అప్పుడు వెళ్ళిపోవలసినవాళ్ళం."

"చంపేస్తున్నావ్ నీ వేదాంతంతో. మందు వేళపట్టున పుచ్చుకోకపోతే ఎలా ఏడుస్తుంది ?"

గుణబాల నవ్వింది తన భర్త అజ్ఞానానికి. జీవాత్మ పరమాత్మలో అయిక్యమైపోవడానికి ఎంత ఉబలాట పడుతుందో యీ మూఢుల కేం తెలుసు? ఈ మాయకాయాన్ని నమ్ముకుంటే మోసమేగా! ఆనందమంతా అవతల ప్రపంచంలోనే! స్వాముల వారి ఉపదేశ సారాంశం ఏమిటి ?

ఆ భక్తి పారవశ్యంలో, వేదాంత ప్రవాహంలో రామూకి సంబంధించిన మధుర భావనలు ఆమెకి రాకపోలేదు. ఒక్కొక్క రాత్రి రామూని గురించిన వేదనాభారంతో నిద్ర

పట్టక జాగారం చేసేది. మరొకొక్కరాత్రి తన రామూ కృష్ణుడైనట్లూ, తను రాధ అయినట్టూ కలలుగనేది.

గుణబాల వాతావరణానికి బానిస. శక్తివంతులూ కార్య దీక్షవున్నవారూ, వారి ఆశయప్రాప్తికోసం లభించిన వాతావరణంతో తృప్తిపడక, దాన్ని ఛేదించి కొత్తదాన్ని కల్పిస్తారు. మెచ్చుగా వస్తోంది కదా అని కంపుకొట్టేమందలో కాలం గడపలేదు. గుణబాల పొట్టిబాల, ఆడది, అసహాయురాలు. భారతదేశంలోని ఒక బానిస ఆమె ప్రభువు. స్వతంత్రమూ ప్రేమా ఆ ప్రభువుకి తెలుసా—యీ సేవకురాలికి యిచ్చేందుకు ?

యుగసంధిసమయంలో నలిగి నశించే జీవులలో గుణబాల ఒకతె. మహాపురుషులకూడా జీవితాంతమనే ఆనందంలోనేగాని లభ్యంగాని శాంతికాంతులు యీబాలకి గూట్లో కూచుని వడపప్పుతినే కృష్ణవిగ్రహం యిచ్చింది. రామూతో స్నేహానికి పరిణామమూ యిది ?

గుణబాలకి దొరికింది శాంతికాదు—నిరాశ. ఆ నిరాశ బురఖా తగిలించుకుని భక్తిరూపంలో పచార్లు చేసింది. అర్థరహితమైన తన జీవితంలోని నిరాశ నిజస్వరూపమే భక్తి— అని చూడగలిగే లోతుచూపు గుణబాలకి లేదు. అంచేత...

హైదరాబాద్ వచ్చిన అయిదో నెలలో గుణబాల శ్రీకృష్ణపరమాత్మలో అయిక్యమయింది.

"భర్త పరువు బాలని బలికోరింది," అన్నాడు రామూ.

—

## యిటు — అటు

సరళకి పదిహేనోఏట వివాహం, మహోత్సవంగా జరుగుతుంది. వివాహమనడమూ పాఠశాలలో నేర్చుకునే చదువుకి స్వస్తి చెప్పడమూ యించుమించు ఒకేసారి సంభవించుతాయి.

పెళ్లి అయి పూరాగా ఒక్క సంవత్సరం గడవకుండానే అమ్మాయిని తమయింటికి పంపవలసిందంటూ అత్తవారు కబుర్లుపంపడం ప్రారంభిస్తారు. సరళకి నూతన గృహాభిగమనంలో ఒక ఉత్సాహమూ ఒకవ్యథా పొడగట్టుతాయి. తన్ను ఆదరించి, లాలించి, ప్రేమించే భర్తసన్నిధిలోకి వెళ్తున్నాననే సంతోషం; చిన్నప్పట్నుంచీ పెరిగిన వాతావరణంలో మార్పు—ఒక పెద్దమార్పు—కలుగుతోందని విచారం. సూరమ్మత్త కూతురు సత్తినీ, నాయనమ్మనీ, తలితండ్రుల్నీ వదలి నూతన పరిసరాలలోనికి పోవడం బాధగా వుంటుంది. కాని తనూ తనభర్త అద్వితీయమైన ప్రేమా, అనురాగ పూరితమైన తమయిద్దరి అన్యోన్యతా—మొదలైన—భావిజీవితపు మధుర భావనలు మార్పుకి సంబంధించిన విచారాల నన్నిటినీ నెట్టేస్తాయి.

ఒక శుభముహూర్తాన చీరె సారెలతోనూ కొంగ్రొత్త సిగ్గులతోనూ సరళ అత్తవారింటికి ప్రయాణమవుతుంది.

భర్త ప్రేమామృతాన్ని తనివితీర అనుభవించడమూ, అత్త మామలనూ, పెద్దలనూ, తగురీతిని గౌరవించడమూ తప్ప అన్యములయిన చీకు చింత లేని వ్యూడవని ఆమె తలపోస్తుంది. ఉత్సాహాతిశయాలతో కూడిన సంతోషంతో ఆమె అత్త వారింట్లో పాదం పెడుతుంది.

*          *          *          *

అత్తవారిల్లు...అది ఒక సమిష్టి కుటుంబం. అత్త మామ లిద్దరికీ షష్టిపూర్తి అవుతుంది. పెద్దబావగారు జ్యోతిషంలోనూ, ఆయుర్వేదంలోనూ అఖండుడంటారు. కాని జ్యోతిష విషయాలు ఆయన్ని అడిగిన పాపాన ఎవ్వరూ పోరు. ఇక వైద్యమూ అంటే?...? స్వతస్సిద్ధంగా ఆయన కోపిష్టి అయిన వైద్యానికి ఎంత పలుకుబడి వుంటుందో, ఎంత ప్రాక్టీసు వుంటుందో చెప్పనే అక్కర్లేదు. రెండో బావగారికి పనివుండదు తీరికావుండదు. నెంబరు మూడు సరళ భర్త. బాంక్ ఏజంటు. నాలుగూ, అయిదూ మర దులు, ఒకడు స్కూలుఫైనల్ మూడేళ్ళనుంచీ చదువుతూ వుంటాడు. ఇంకొకడు మొన్ననే థర్డుఫారంలో నుంచి తేలు తాడు. యిద్దరు వదినెలుంటారు. అందులో పెద్దామెకి తల నొప్పుతుంది. రెండో ఆమెని భర్తవచ్చి లేపుతాడు. కుర్రకారు సంఖ్య ఏడెనిమిది దాకావుంటుంది.

కుర్రాళ్ళందరికీ వుదయానే చద్దన్నాలు. పెద్దవాళ్ళందరికీ కాఫీలు, పదిగంటలు మొదలు ఒంటిగంటన్నర దాకా పెద్ద

వాళ్ళు ఒక్కొక్కరూ భోజనానికి లేస్తారు. మూడింటికి టీ. అయిదుగంటలకి ఆరంభిస్తారు రాత్రి వంటకి కావలసిన పనులు సమకూర్చుకోవడం.

వారిది సమిష్టి కుటుంబ మవడంచేత ఒకరిని కాదనేందుకూ, ఒకరిని ప్రశ్నించేందుకూ యింకోరికి ఎట్టి హక్కూ లేదు. ఎవరికి వారే పెత్తనదారులు. యింటిపెత్తనమంతా తలచెడిన వదినగారిమీదనూ, అత్తగారిమీదనూ ఆధారపడి వుంటుంది. యితర వ్యవహారాలన్నీ మామగారిమీదనూ ఆయనకి ఆసరాగావుండి మంచీ చెడ్డా చూస్తున్న పెద్ద బావగారి మీదనూ వుంటాయి.

సరళభర్త ప్రతినెలా రెండో తేదీన తను సంపాదించే నూటఏభై రూపాయలలోనూ, పదిరూపాయలు తన స్వంత ఖర్చుకని వుంచుకుని, తక్కిన సొమ్మంతా తండ్రిచేతులలో పోస్తాడు. అలా చేయాలని అతను సాంప్రదాయాను సిద్ధంగా నమ్ముతాడు. అలాచేస్తున్న వారందరూ పూజ్యులూ, పుణ్యాత్ములూ అని లోకులు భూషిస్తూవుండడం అతను చెవులార వింటూవుంటాడు. అంచేత, అతనుకూడా ఆ ప్రకారమే చేస్తున్నాడు.

యీ సమిష్టి కుటుంబాకంపెనీ అతను ఏవూరికి ట్రాన్స్ఫర్ అవుతే ఆ వూరికి మారుతూ వుంటుంది.

* * * *

అలాంటి వ్యూహంలోకి స్వతంత్రభావాలతోనూ మధుర భావనలతోనూ సరళ ప్రవేశిస్తుంది. నెలరోజులు ఆమెని అత్యాదరంతో గౌరవిస్తారు. నడుస్తే పాదాలు అరిగిపోతాయేమో అనీ, ఎండలోకి వెళ్తే మొహం కందిపోతుందేమో అనీ, కాఫీ ఆలస్యమైతే ఆమెకి శోషవస్తుందేమో అనీ అందరూ ఆమెని అమితంగా మర్యాదచేస్తారు. ఈ శుష్కమర్యాదలతోనూ, యీ ఆర్భాటపు ఆదరాలతోనూ, యీ అనవసరపు హడావిడితోనూ ఆమె వుక్కిరి బిక్కిరి అవుతుంది.

సరళకి అక్కడి పద్ధతిఅంతా అయోమయంగా వుంటుంది. రెండో నెల గడచేటప్పటికి సరళమీద యింతకిపూర్వం వున్న గౌరవాభిమానాలు క్షీణిస్తాయి.

సాయంత్రం ఆఫీసునుంచి బడలికతోవచ్చే తన భర్త కోసం ఫ్లాస్కులో పోసివుంచిన కాఫీ తన తోటికోడలు బావగారి కివ్వడం సహించలేక పోయింది.

చిన్నతోటి కోడలు పుట్టింటికి వెళ్ళడం; పెద్దతోటికోడలు వాకిటచేరటం, వదినెగారికి తలనొప్పి ప్రాప్తించడం, అత్తగారికి రాత్రిపూట కళ్ళు సరిగ్గా ఆనకపోవడం, యిన్ని కారణాలవల్ల సరళ మడి గట్టుకోవలసి వస్తుంది. అలవాటు లేని వంట, అంతమందికి చేసి పెట్టడం, ఆమెకి కొద్దిగా కష్టంగానే వుంటుంది. తనకీ తన భర్తకే అయితే ఎంతో సరదాగా వండి వుండేది.

కాఫీకప్పు జారి పడిపోయినందుకు అత్తగారు కష్టతరంగా మాట్లాడడం సరళ మనస్సుకి నొప్పి కలుగుతుంది,

ముచ్చటగానూ, ముద్దుగానూ దంపతులిద్దరూ సినీమాకి వెళ్దామనుకుంటూ వుండగా, మిడతల దండులా ఆ మెని యింట్లోవాళ్ళందరూ వెంబడించడం విసుగు తోపిస్తుంది.

మామగారూ, బావగారూ సావిట్లోకి వచ్చినప్పుడు పొరపాటున తాను నుంచోక పోవడం ఒక నేరంగా ఎంచిన అత్తమీద కోపం ఏర్పడుతుంది.

సరిగ్గా అర్ధసంవత్సరం తిరగదు—తన భర్త సంపాయిస్తున్న సొమ్మును వీరందరూ అనుభవిస్తూ, తనమీద అథార్టీ చేస్తూ, చాకిరీ చేయించుకునేందుకు వీరెవరన్న ద్వేషభావం పొడసూపుతుంది.

యిక మొదలు, వీరిని వారూ—వారిని వీరూ ద్వేషించుకోవడం.

* * * *

సరళ భర్తతో చెప్పుకుంటుంది—తనకి జరుగుతున్న అన్యాయాలన్నీ.

అత్తగారు కొడుకుతో చెప్తుంది—కోడలు చేస్తున్న పెంకితనం.

వదినగారు తమ్ముడితో మొర పెడుతుంది—మరదలు చేస్తున్న మారాములు.

అక్కవిషయం అంతగా ఆలోచించవలసిన అవసరం లేకపోయినా, చిన్నప్పట్నుంచీ పెంచి, పెద్దవాణ్ణిచేసిన తల్లి మాట తోసేసేందుకు ధైర్యంచాలదు. ప్రియురాలి ప్రశ్నలకి సమాధానా లివ్వడం చేత కాదు. కత్తెరలో పడిన పోక చెక్క మాదిరిగా వుంటుంది సరళ భర్తస్థితి.

* * * *

సుమారు సంవత్సరం గడుస్తుంది.

"నేనీ బాధలు పడ లేను. అయినదానికీ కానిదానికీ మీ అమ్మగారు తప్పులు పడుతూవుంటారు." అంటుంది సరళ.

"ఏమిటేమిటి!" అంటాడు, కంగారుతో సరళభర్త.

"మనం వేరే కాపరంపెట్టాలి."

"లోకం హర్షించవద్దూ? మావాళ్ళంతా నా రెక్కల మీద ఆధారపడి వున్నారు."

"మీరు పిచ్చివారు కనక వార్ని కూచోపెట్టి అష్ట కష్టాలుపడి వార్ని మేపుతున్నారు. వారికేమన్నా కృతజ్ఞత వుందా?

"లేదంటావా?"

"ఉంటే నన్ను అనాదరించడం ఎందుకు? మీ అమ్మ గారికీ మీ అక్కగారికీ నామీద యీర్ష్య ఎందుకు? నేనేం చేసాను?"

"అదంతా వేరు."

"మీరు పిచ్చివారు...మనం వేరుందాం."

"తప్పు...తప్పు...అలా అనకూడదు."

"అవుతే నేను మా పుట్టింటికి వెళ్ళిపోతాను."

సరళభర్త దీర్ఘంగా యోచిస్తాడు. తను సంపాయించిన సొమ్మే తన తమ్ములూ, అన్నలూ, తలితండ్రులూ స్వేచ్ఛగా అనుభవిస్తున్నారు. సయిగా తన భార్యని, తన అర్ధాంగిని, తన ప్రాణేశ్వరిని సరిగ్గా గౌరవించడంలేదు. ఆ విషయం... వేరుపడితే ప్రతిష్ట పోతుంది. అంచేత, భార్యని కొద్దిగా మందలించాలి, అలా మందలిస్తే తనకి మంచి Character వుందని లోకులు అనుకుంటారని భ్రమిస్తాడు.

*         *         *         *

సరళ సాంప్రదాయానికి కట్టుపడి, స్వాతంత్ర్య దేవతా రాధన మానేసి, కుటుంబ మంతటికీ దాసీ అయినా అయి పోతుంది.

లేదా...

కష్టాలకీ, మనోవ్యధలకీ గురిఅయి వ్యక్తిత్వాన్నయినా నిరూపించుకుంటుంది.

## 2

ఇంకా, టీన్సులోనే వున్న కాలేజీగరల్‌ని ఒకసారి చూడండి. గులాబిరేకలమాదిరి వుండే చెక్కిళ్ళ అపురూప సౌందర్యానికి ఆమె గర్వపడుతోందంటే ఒక వింతకానేరదు. శరీరచ్ఛాయ, ముఖకవళిక, ఎంత ఆకర్షణీయంగా వుం

టూదయో, ఆమె హృదయం కూడా అంత సరసమూ, సున్ని తమూనూ. ఆరోగ్యవిషయాలకి ఆమె ఎంత ప్రాముఖ్యత యిస్తుందో మానసిక సంస్కారం కూడా అంత వుంటుంది ఆమెకి.

మేనమామ కూతురు శారద కంటెనూ, పినతల్లికూతురు హేమలత కంటెనూ, తను అన్నివిధాలా అదృష్టవంతు రాలు నని ఆమెకి స్పష్టంగా తెలుసును. చిన్నప్పటి తన బాల్యస్నేహితు లిద్దరూ సంసారనౌక జీవితాంబుధిలోనుంచి తోసుకు వస్తున్నారు. వారిద్దరికీ జీవితము ఒక తోపుడుబండీ అయిపోయినది. సమాజమనే రాక్షసి, ఆచారాలనే చేతు లతో, ఆ బండిని ముందుకు నెట్టుతోంది. కాని తనకో ? అలాకాదు. ప్రతి సూర్యోదయములోనూ ఒక నూతన తేజస్సూ, ఆనందహేతువయిన ఒక అపూర్వ వికాసమూ స్ఫురిస్తున్నాయి. ప్రతి అంధకారాన్ని ఒక నూతనోదయము కబళించెయ్యగలదని గ్రహించగలిగిన భావనామణి ఆమె.

కోడికూసి నప్పుడు ఆమె లేవలేదు. అప్రకారం లేవడం ఆరోగ్యకరమని ఆమె ఎలిమెంటరీ స్కూలులో నేర్చు కున్నది. ఆ సిద్ధాంతము ఆమె జీవితములో ఆదినించీ అనా చరణీయమే అయినది. అది ఆచరణలో పెట్టాలని ఏనాటి కానాడే అనుకుంటుంది. కాని యీనాటికూడా ఆ ఆవశ్య కత ఆమెకి పొడగట్టలేదు. ఆవశ్యకత ఏవిషయాన్నైనా ఆచరణీయముగా చేయగలదు. అందుచేత ఏడుగంటలకి

బిగ్ బెన్ గణగణ అలారం కొట్టిన ఐదునిముషాలకి గాని ఆమె వొళ్ళు విరుచుకుంటూ, కళ్ళుతుడుచుకుంటూ, నిద్ర పక్కమీాదనుంచి లేవదు.

తమతోడి బాలికలు తమ భర్తలకి సకలోపచారాలూ చేస్తూ, ఆ పురుషసింహాల అడుగులికి మడుగు లొత్తుతూ, తమ స్వ్యక్తిత్వాన్ని ఖూనీచేసుకొని పురుషజాతికి దాసీలై పోయినారని ఆమె విచారించని నిముషము లేదు. తన సాను భూతి వాళ్ళకి తెలియపర్చడానికి మార్గములేక తపించి పోతుంది.

భర్తచే తాపులుతిన్న నాగాంబనీ, అత్తవల్ల అను క్షణమూ అదమాయింపులు అనుభవించే అచ్చమ్మనీ, మరదలుమాట వినకపోవడంవల్ల మూడురోజులు పస్తుండడం సంభవించిన మహాలక్ష్మినీ తలుచుకుంటే ఆమె గుండె ద్రవీ భూత మౌతుంది. వాళ్ళ అవస్తకి హృదయంవున్న ప్రతి వాడు జాలిపడక మానడు. తను వీరందరికంటె ఎన్నోరెట్లు అదృష్టవంతురాలునని, ఆమె దెయ్యాలనీ, దేవతలనీ థాంక్ చేస్తుంది. కాఫీ తాగి, కాసేపు కాలేజీ పుస్తకాలలో నిమగ్నురాలై కూచుంటుంది.

ముసలమ్మ అమ్మాయికి మూాడుముళ్ళూ ఎప్పుడు పడ తాయా అని ముదుస్తూ వుంటుంది. తల్లి తండ్రితో 'అమ్మాయి పెళ్ళివిషయం' అంటుంది. తండ్రి 'దానంతటదే ఎవరి కోరి పెళ్ళిచేసుకోవాలి. ఆ విషయం నేను కలగజేసు

కోను' అంటాడు, ఖరాకచ్చీగా. ఇంతలో గణగణ కాలేజీ గంట కొడతారు.

మధ్యాహ్నం ఒంటిగంటనుంచీ రెండు గంటలదాకా కాలేజీగరల్సు అందరూ వెయిటింగ్‌రూములో కూచుని పిచ్చాపాటీ చెప్పుకుంటారు. వారి సంభాషణలలో-హిట్లర్-షా-షేక్సుపియర్—జెరూసలెమ్‌లోని అరబ్బుల అల్లర్లు—అమెరికాలోని సెక్సునేరాలూ—మీరాసాహేబుతో లేచి పోయిన మాధురీ—ఒకటేమిటి అన్నిరకాల విషయాలూ ప్రస్తావనకి వస్తాయి. అందరూ వాగ్వాదంలో పాల్గొంటారు. ఏ ఒక్కరూ యింకోరితో ఏకీభవించరు.

కాలేజీలో చదువుతున్న తాము భావిభారత శాదేభ్యుదయానికి ఆదర్శ స్త్రీరత్నాలు అన్నట్లు తలపోస్తారు. కాలేజీ చదువైపోయిన తర్వాత ప్రతివాక్కరూ లోకాన్ని కొంత కాలం మరమ్మత్ చెయ్యాలని తీర్మానించుకుంటారు. తలచుకొన్నప్పుడల్లా వారి విశాలదృక్పథంలో, భారతదేశంలో స్త్రీ జనానికి జరిగే అన్యాయాలూ, అఘోరాలూ, అవినీతులూ కనిపిస్తుంటాయి. భావిజీవితంగురించిన కలలు కంటూండగా ఠంగుఠంగు మని కాలేజీగంట వినిపిస్తుంది. దబాదబా అందరూ తమక్లాసుల్లోకి పోతారు.

మధ్యాహ్నం రెండుగంటలూ చాలా నిద్రమత్తుగా వుంటుంది. ఎప్పుడు నాలుగు అవుతుందా అనిపిస్తుంది. నాలుగవగానే యింటికిపోయి కాసిని టీ నీళ్ళు కడుపులో పోసుకుంటేనే కాని యంత్రం సాఫీగా పని చెయ్యదు:

కాలేజీగరల్ టీ సకాలంలో పుచ్చుకుంటుంది. రింగ్ టెన్నీసో, టెన్నీసో, బేడ్మింటనో ఆడుకునేందుకు పయన మవుతుంది. టెన్నీను ఒక సెట్టుకంటె ఎక్కువగా ఆడు కునేందుకు వీలుండదు. బాడ్మింటన్ ఒక గేము ఆడే టప్పటికి, రింగ్ టెన్నీసు ఆడుకుందామని మరొకరు పిలుస్తారు.

చీకటి పడుతూండగా డాక్టరుగారి అమ్మాయీ, భావకవి గారి మరదలూ, కాలేజీగరలూ యింటికి మరలుతూంటారు. శ్రావణ మంగళవార పునోములే యీ జీవితానికి ముక్తి మోక్షమూ, సౌఖ్యమూ సంపదా యిచ్చేవని మూర్ఖంగా నమ్ముతూ సాంప్రదాయాన్ని గుడ్డిగా Follow అయ్యే అమ్మ లక్కలు-ఆమెకి వుండే స్వాతంత్ర్యానికి అసూయపడి, తమ కలాటి స్వేచ్ఛ లేకపోయిందికదా అని యీర్ష్యతో, అయిన మాటలూ కానిమాటలూ ఆ అమ్మాయికి నెత్తిన రుద్దుతారు.

ప్రప్రథమంలో స్కాండల్ అంటే కాలేజీగరల్ బెదురు తుంది. రానురాను అలవాటైపోతుంది స్కైదెనాఅంతే. క్రమక్రమంగా ఆమె తెలుసుకుంటుంది. ఔన్నత్యమనే అంతఃపురానికి యీ స్కాండల్సన్ని మెట్లని. నానాటికీ

ఆమెలో మానసిక బలం వృద్ధిచెందుతుంది. తననుగురించిన స్కాండల్స్ విని ఘకాలున నవ్వుతుంది. సంఘానికి వున్న నీచదృష్టిని అసహ్యించుకొంటుంది.

తన వయస్సులో వున్న యువతు లందరికంటెనూ తనకి అన్నివిషయాలూ ఎక్కువగా తెలుసుననీ వారందరూ మూర్ఖ చిత్తులనీ, తను ప్రాజ్ఞత తెలిసిన వివేకవతిననీ ఆమెకి అహం భావం లేకపోలేదు. నిజంగా ఆమెకి అహంభావం వుండడంలో కూడా చోద్యంలేదు.

కాలేజీలో ఆమెకి యింగ్లీషుమీద వున్నంత మోజూ అభిలాషా తెలుగుభాషమీద వుండదు. తెలుగు, స్త్రీలను అనాగరికులను చేస్తోందనీ, ఇంగ్లీషు, సంస్కారాన్ని కలిగించ డానికి మార్గదర్శి అవుతోందనీ ఆమె అపోహ. ఆకారణం వల్ల అప్పుడప్పుడు తెలుగుక్లాసులు మానేస్తుంది.

ముసలమ్మ పర్వదినాలకీ ఏకాదశీలకీ వుపవాసం చెయ్యడం వల్లనే అజీర్ణవ్యాధితో బాధ పడవలసిన అగత్యం లేక పోయిందంటుంది. అమ్మ నోముల్లో గొర్రెతనంతప్ప అన్యం ఏమీ లేదంటుంది. తండ్రి మేధావి అనీ ,అలాటి విజ్ఞాన వంతుడికి కూతురై పుట్టడం తన అదృష్టమనీ అనుకుంటూ నాన్నని ఘట్రాయిలా పొగుడుతుంది.

దేవుడివిషయంలో ఆమెకి స్థిరమైన భావం ఏమీ వుండదు. 'దేవుడు వుంటే నేం, లేకపోతే నేం, నీ డ్యూటీ నువ్వు చెయ్యి' అది, ఆమె సిద్ధాంతం. మతమనేమాట వింటే, అర్థం తెలుసుకోకుండానే మండిపడుతుంది.

ఆమె నవయుగదృష్టిలో తన భావిజీవితము మధురమైన ఒక పూలపాన్పు. ఆనందమయజీవితపు ఛాయామాత్రములైన కలలు కంటూవుంటుంది. తను భారతదేశాన్ని ఉద్ధరిస్తానంటుంది. ఉద్ధరించగలను కూడాను.

# ఎడిటర్

"వున్న వుద్యోగాలన్నిటిలోనూ ఒకటో రకమైనవి రెండు; మొదటిది బడిపంతులు వుద్యోగం. రెండోది ఎడిటర్ వుద్యోగం" అంటూండేవాడు విశ్వనాథం.

"ఏం?" అని నేను ప్రశ్నిస్తూండేవాణ్ణి.

"బొజ్జలో సెల్సు కదలక! హాయిగా కుర్చీలో విగ్రహంలా కూచోడం, ఎవో కథకులూ వ్యాసకర్తలూ వారికి తోచినవి పంపుతూంటారు. వచ్చినవాటిలో మంచివీ, పాఠకలోకానికి అభిరుచిని కలగచేసేవీ ఏరుకోడం, అంతేకదూ? ప్రపంచ జ్ఞానం వున్నవాడెవడైనా చెయ్యగలుగు ఎడిటర్ పని," అని తేలికగా అనేసేవాడు.

వోరి వెధవాయ్! ఎంత సులభంగా చెప్పేసావురా! సూక్ష్మంలో మోక్షం అన్నట్టు—అనుకుంటూ నాలో నేను నవ్వుకునేవాణ్ణి.

పదీ అయ్యేటప్పటికి ఆఫీసులో హాజరు కావాలి. హాజరవడంలో ఏమాత్రం లేటయినా లేటుమార్కు. ఒక నెలలో మూడు లేటుమార్కులు అయితే ఒక బ్లాకుమార్కు. మూడు బ్లాకుమార్కులు వచ్చాయంటే మా ప్రొప్రయిటరు యిచ్చే జీతంలోంచి పది రూపాయిలు విరగ్గోస్తాడు.

"సబ్బుబిళ్లా, యింకా ఏమిటో" అని ఏమిటో మా ఆవిడ చెప్తూండగానే ఆఫీసుకైమైపోయిందని, బెంచీ ఎక్కిస్తాడేమో

మేష్టరని గబగబా హైస్కూలుకి పోయే కుర్రాడిమాదిరిగా తొందరగా పడవడంచేత, యీ భౌతిక కాయం విశ్రాంతి కోరుకుంటుంది.

తీరికగా కూచుని అలసట తీర్చుకునేలోపున బంట్రోతు వ్యాసాలకట్ట తీసుకొచ్చి బల్లమీద పెడ్తాడు.

అందులో సుమారు ఓ పది పన్నెండు వ్యాసాలదాకా వున్నట్లు చూసీ చూడడం తోటే గోచర మవుతుంది అమ్మయ్య! కంపోజిటర్ బాధ పడక్కర్లేదు. మేటరు దొరికింది. నాయనా!'' అని నూతన ప్రియాసందర్శనంచేత ప్రేమికుడి మనస్సులో కలిగే వుత్సాహతరంగాల్లాటివి నా మనస్సులో కూడా వుప్పొంగిపోవడం మొదలెడ్తాయి. శ్మశాన భూమిలో హరిశ్చంద్రుడికి ప్రత్యక్షమైన దేవుడిలా, నా వెనకాల 'మేటర్ సార్' అని అంటూ కంపోజిటర్ ప్రత్యక్ష మవుతాడు. నేను వులిక్కి పడి 'ఓ అరగంట వుండవోయ్!' అని వోపికతో అంటాను.

చూస్తునుగదా యిక వ్యాసాలవిషయం !!! ఒకాయన వ్యాసం భూతద్దంతో చదవాలేమో అని సందేహం కల్గుతుంది. యింకో ఆయన వ్యాసం నాల్గో క్లాసులో చదువుకునే కుర్రాడిచేత కాపీ చేయించినట్లుంటుంది. ఒకాయన శీర్షికకు లతలూ అవీ రంగు పెన్సిల్‌తో చెక్కుతాడు; చూడగానే నవ్వు వస్తుంది. మరో ఆయన వ్యాసం శీర్షిక యీలా వ్రాస్తారు. ''ఆర్య కాలము నాటి హిందూ దేశపు సాంప్రదాయ

ములకూ బ్రిటీషు పాలనను క్రమించవున్న హిందూదేశము నకునూ గల తాదాత్మ్యములు!" శీర్షిక అనేది ఓ వాక్యం కాదనీ పాఠకుని మనస్సులో మొట్టమొదట అభిరుచిని కలుగ జేసేది శీర్షికే అనీ, కొందరు తెలుగురచయితలు తెల్సుకో లేక పొయ్యారుగదాఅని. నవ్వూ విచారమూ వస్తాయి. వో పెద్దమనిషి వో చిన్నపద్యం పంపించి పేమెంట్ సెటిల్ చెయ్యనిదే ప్రచురించకండేం, అని వారిస్తాడు. మేము పద్యాలు ప్రకటించమని పదేపదే పత్రికలో చెప్పుకుంటూనే వుంటాం. బహుశా ఆయనెవరో భావకవి కాబోలు! ఆయనకి సామాన్యవిషయాల్తో ఎక్కువ సంబంధం వుండదు. అంచేత మా విజ్ఞాపనని ఎప్పుడూ చూసిన పాపాన పోలేదను కుంటాను.

కట్టంతా చూస్తాను. ఏవో ఒకటో రెండో నచ్చుతాయి. పదిన్నరా అవగానే మళ్లీ కంపోజిటర్ ప్రత్యక్షమవుతాడు.

"మేటర్, సార్."

"ఇదిగో" అని అంటూ సెలక్టు చేసినవ్యాసాన్ని యిస్తాను. ఆకలితో అల్లల్లాడే అబ్బాయికి అన్నంపెట్టినట్టు, తృప్తిని వెలిబుచ్చే మొహంతో కంపోజిటర్ నిష్క్రమిస్తాడు.

ఎక్స్ఛేంజికి వచ్చినపేపర్లు ఒకటి తరవాత ఒకటే చూస్తూవుంటాను. ఇంతట్లో 'భావవీధి' సంపాదకులు వేం చేస్తారు. "దయచెయ్యండి! దయచెయ్యండి!!" అని సగౌరవంగా ఆహ్వానిస్తాను. ఆయన ఆఫీసుపన్నెండుగంటలకి.

అంచేత, రోజూ ఆఫీసుకి పోయేటప్పుడు మా ఆఫీసులోకి వచ్చి నన్నోమారు చూసిపోతుంటారు.

"ఈ రోజుల్లో వ్యాసకర్తల్లోనూ, కథకుల్లోనూ బహు బాధగా వుందండీ," అని సంపాదకసంబంధమైన సంభాషణ మొదలెడ్తాను.

"అవునండీ," అని ఆయన నాగోలకి తలవూపుతూ, తన గోల నాతో చెప్పుకుని, తన మనోభారాన్ని తగ్గించు కుంటాడు.

ఓ పావుగంట కూచున్న తర్వాత లేచిపోబోతాడు.

"మేటర్ గురించి చాల చిక్కు పడ్తున్నానండీ," అంటాను.

"ఓకత్తెర దగ్గిర పెట్టుకొని ఎక్స్చేంజికి వచ్చిన పేపర్ల లోంచి కత్తిరించవయ్యా!" అని సలహా యిస్తాడు.

నవ్వుతూ "మా ప్రొప్రయిటరుకు తెలుగువచ్చండీ! అలాచేస్తే జీతంతగ్గిస్తాడు," అని అధికారియెడ వుండే వినయ విధేయతల్ని మూషోవాశిదగ్గర ఎలా నటించాలో అలా నటిస్తాను.

ఆయన 'సెలవు' అంటూ వెళ్ళిపోతాడు. నేను మళ్ళీ కుర్చీలో చతికిల బడతాను.

* * * *

ఇలాగా, అలాగా కాలం గడుస్తూండగానే వంటిగంట అవుతుంది. కాఫీ అని కట్టె కంగారుపడుతుంది. లేస్తాను.

దగ్గరవున్న కాఫీ హోటల్‌కి వెళ్తూంటాను. దారిలో ఎవడో స్నేహితుడు అగుపించి 'ఏమహో సంపాదక మహాశయులా నమస్కారం!' అని అంటాడు.

"నమస్కారం" అని నేనూ అంటాను.

"ఎక్కడికి?"

"కాఫీ వేళ కాదండీ, హోటల్‌కి పోతున్నా."

"పదండి. నేనూవస్తా."

ఇద్దరం కాఫీ తాగుతాం. బిల్లు యిచ్చేందుకు పర్సు తీస్తాను. 'నేనిస్తానెండి' అంటాడాయన. చప్పు చప్పగా వూరుకొంటాను. సిగరెట్లూ కిళ్ళీలూ నేనేకొంటాను. కిళ్లీ నములుతూ సిగరెట్టు కాలుస్తూ ఆఫీసువైపుకు వస్తూవుంటాం. 'ఇక సెలవా!' అని అడిగిస్తాడాయన.

"ఊ" అన్నట్లు తలవూపుతాను.

మళ్ళీ నా వ్యాసాలకట్టలూ, నా పత్రికలూ, నేనూ.

*　　*　　*　　*

రెండవుతుంది ఎవరో భావకవి వస్తాడు, భావకవిని వర్ణించడం అనవసరం కదా!!!

"ఏమండీ, నేనీమధ్యనే ప్రేమమీద కొన్ని పద్యాలు వ్రాసితిని. మీ పత్రికలో ప్రచురింతురనే భావంతో తమ దర్శనార్థమై వచ్చితిని." అని సవినయంగా భావకవి భాషలో అడుగుతాడు.

"పద్యాలు మా పత్రికలో ప్రచురించమండీ" అని నిష్కర్షగా చెపుతాను.

"వాఙ్మయమనే అంటుకి నేను కవిత్వమనే పువ్వుని..." అని కాసేపు కవిత్వంలో వృంజే మజా నాకు చెప్తాడు.

"ఈ పద్యాలు చాలా బావున్నాయని నామిత్రులు మెచ్చుకొన్నారండీ," అంటాడు.

"అవునే కన్సిడర్ చేసి, తర్వాత మీకు తెలియ జేస్తాను," అని విన్నవించుకుంటూ ఆ పద్యాల కట్టని డస్టుబిన్లోకి తోసేస్తాను.

"నమోనం నమః" అంటూ ఆయన సెలవు తీసుకుం టాడు.

*          *          *          *

మూడవుతుంది. సూట్ హేట్తో ఎవరో యువకుడు వస్తాడు.

"గుడ్ మార్నింగ్ ! మిస్టర్ ఎడిటర్ !" అని అంటాడు హేటుతీస్తూ

"వెరీగుడ్ మార్నింగ్," అని నేనూ అంటా ఆ అతిథి కూచునేందుకు కుర్చీ చూపిస్తూ.

"నా వ్యాసం చూశారా ? అని అంటా డాయువకుడు జేబురుమాల్తో మొహాన్ని విసురుకుంటో.

"తమ పేరు ?" అని అడుగుతా నమ్రతతో.

"సీన్"

"తమ వ్యాసం పేరు ?"

"వాడు లవ్ చేసాడు."

"ఓహో! అది మీరేనా వ్రాసింది."

"ఏం, అలా అంటున్నారు?"

"ఏం లేదు లెండి," అని డస్కులోంచి అతని వ్యాసాన్ని తీసి బల్లమీద పెట్టాను.

"చదివారా?"

"చదివాను."

"బావుండలేదూ?"

"వోమాదిరిగా వుంది."

"ఊహు!" అంటూ జేబులోకి తోసేస్తాడా యువకుడా వ్యాసాన్ని.

ఇక మొదలెడ్తాడు గాసిప్ 'షెల్లీ' గురించీ, 'షేక్స్పియర్' గురించీ, 'బైరన్' గురించీ, 'బేకన్' గురించీ, 'షా' గురించీ, 'షెకవ్' గురించీ తనకి తోచిన విమర్శలన్నీ వాగుతాడు. ఇంకో పదిమంది పేర్లు వరసని చెప్పేస్తాడు. ప్రవరాఖ్యుడు నపుంసకుడనీ, వరూధిని సెక్స్ ఎబ్నార్మలనీ ధాటీగా అంటాడు. తెలుగువాళ్ళు వెర్రిపుల్లాయిలని, తేలుస్తాడు చివరకి. తెలుగు దేశంలో పత్రికలన్నీ ఏడుస్తున్నాయనీ, పత్రికాసంపాదకులు అసమర్థులనీ వాళ్ళకి వాఙ్మయం అంటే ఏమిటో తెలీదనీ మాట్లాడుతాడు.

యువకుల్లో వుండే లోటేయిది. పుస్తకంలో పది పేజీలు చదవగానే ఆ పుస్తకంమీద తాను అథారిటీ అంటాడు. అవతలవాడు తనకు తెలీదని అనుకుంటాడేమోనని, అవతల

వాణ్ణి అసలు మాట్లాడనే మాట్లాడ నియ్యడు. తానే వాగు
తాడు వసపోసిన పిట్టలా. వాగుడికి తలాతోకా వుండదు.

నాలుగున్నర అవుతుంది. తన వ్యాసాన్ని ప్రచురించ
డానికిగాను అంగీకరించ లేదని మనస్సులో తిట్టుకుంటూ,
పైకి తిట్టే తిట్టనట్టు 'గుడ్ బై' చెప్తూ వెళ్ళిపోతాను.

"వెర్రినాగమ్మ!" అనుకొంటూ మనస్సులో.

నాఖర్మం కాలడంచేత కాని, ఈ ఘ్రాల్సుందరి చేతనూ
తిట్లు పడకం నాకెందుకని మనసులో చింతిస్తూంటాను.

*　　　*　　　*　　　*

అయిదవుతుంది బెల్ కొడతాను. బతికానురా బాబూ
అంటూ బయటికి వస్తూంటాను. మెట్లు దిగుతూంటే
ఏ సనాతనాచార్యో ప్రత్యక్షమవుతాడు. 'బహుకాల దర్శ
నం' అని అంటూ దాయన దణ్ణం పెడ్తూ.

నేనూ దణ్ణం పెడ్తాను.

"తమ దర్శనార్థమే వస్తు..." అని యింకేమో
చెప్పబోతాడు.

"ఏం?"

"రామాయణము నేను తెలుగులో వ్రాసినాను."

"అవుతే!" అని ప్రశ్నిస్తా, ఆయన సందేశం పూర్తి
అవకపూర్వమే!

"తమ పత్రికా రాజములో..."

''మా పాఠకులకి పురాణగాథలు అవసరంలేదు, ఇప్పటికే యీ మెట్టవేదాంతాల్లోనే, ఈ పనికిమాలిన పురాణగాథల్లోనే, ఆ భ్రమల చెత్తలు పేరుకున్నాయి.''

టపీమని చెప్పిన నా జవాబుకి తెల్లమొహంవేసి 'సెలవా' అంటూ నిరుత్సాహంతోనే, మెట్లమీదనించే వెనక్కి తిరిగి వెళ్ళిపోతా డాయన.

* * * *

బీచికి వెళ్దామనుకుంటూ వుంటాను.

ఇంతలో, గృహమూ, గృహిణీ, సంసారమూ, పిల్లలూ మనోవీధిలో తాండవ మాడతారు.

''బీచికి రేపు వెళ్ళవచ్చు. ఇంటికి పోదాం'' అని నిశ్చయించుకొని గృహోన్ముఖుణ్ణి అవుతాను.

వెళ్ళివెళ్ళగానే మా ఆవిడ తలకాయనొప్పి అనో, డొక్కలోనొప్పి అనో, నడుంనొప్పి అనో కంప్లెయింట్ చేస్తుంది. ఏదీకాకపోతే వాకిటుంటుంది.

రాత్రిపడ్తుంది. తెల్లవారుతుంది. కాఫీతాగుతాను. తొందర భోజనం. మళ్ళీ మామూలు.

సమాప్తి.